
అప్సరా మరియు నటరాజ్ పెన్సిళ్ళు
రంగురంగుల డిజైన్లలోని అందం
చేతిలో ఇంద్రధనసు లాంటి మురిపెం.
మెరిసేలా, అందమైన డిజైన్లల్లో,
ఇంద్రధనస్సులోని రంగులన్నిట్లో.
ప్రతిపెన్సిలూ ఎంతో మృదువుగా,
నల్లగా రాస్తుంది. దీన్లో బాండెడ్ లెడ్
ఉంది గనక చెక్కేటప్పుడు యిది
విరగదు, అందుకే మరి సన్నని
మొలికలు గల మొనలు.
బాండెడ్ లెడ్
అప్సరా మరియు నటరాజ్
పెన్సిళ్ళు ఎక్కువ కాలం పనిచేసే పెన్సిళ్ళు
హిందూస్థాన్ పెన్సిల్స్ ప్రైవేట్ లిమిటెడ్, 79 పాల్టన్ రోడ్, బొంబాయి 400 001.
OBM 4714 TL

డాక్టరుగారూ! మా బొమ్మ పాపాయికి వంట్లో బాగాలేదు. కొంచెం చెక్ చేసి చెప్పండి సార్.

జ్వరంలాంటిదేం కాదు. కడుపులోనే ట్రబుల్. ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్ ఇవ్వండి. తగ్గిపోతుంది.

ఇదివర్షాకాలం కదా డాక్టర్. ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్ ఇవ్వవచ్చా?

దానికేం? ఎండాకాలమైనా, వర్షాకాలమైనా చలికాలమైనా, ఏ కాలమైనా సరే. పిల్లలకు కడుపులో ఎలాంటి ట్రబుల్ వచ్చినా ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్ ఇవ్వండి.






100 ఏళ్లుగా మాతృలోకం విశ్వసించినది

# ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్

CAS OPPL 3/80 TE

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''కనువిప్పు''] కు ఆధారం వి. యజ్ఞరామయ్య రచన.

పరిస్థితుల ప్రభావం మనుషుల ప్రవర్తనలోని మంచి. చెడులకు ఎలా మూలకారణం అవుతుందో, ''దొంగ-తేలు'' అన్న కథలో చక్కగా వివరించబడింది.

## అమరవాణి

అంకాధిరోపిత మృగశ్చంద్రమా మృగలాంఛనః,
కేసరీ నఖనిర్భిన్న మృగయూథో మృగాధిపః.

[బుద్ధిమార్దవం కొద్దీ జింకను చేరదీసిన చంద్రుడికి, మృగలాంఛనుడనే అల్పనామం; తన వాడిగోళ్లతో మృగాలను చెండాడే సింహానికి, మృగరాజు అన్న గొప్ప పేరూ కలిగాయి. ఆశ్చర్యం కాదా!]

సంపుటి 68 మే '81 సంచిక 5

విడి ప్రతి : 1-50 : : సంవత్సరచందా : 18-00




CHITRA



# రాజుల కలహం

సుదర్శదేశపు రాజకుమారి చంపావతి అతిలోక సౌందర్యవతిగా పేరు గాంచింది. ఆమె అందాన్ని చూసి మోహించిన అనేక మందిలో, సునాగదేశపు రాజు జయచంద్రు డొకడు. చంపావతికి స్వయంవరం అని తెలియగానే, జయచంద్రుడెంతో ఉత్సాహంగా సుదర్శదేశం తరలి వెళ్ళాడు. అయితే, స్వయంవరంలో చంపావతి పున్నాగదేశపు రాజు ఉదయనుడి మెడలో వరమాల వేసింది.

సునాగ, పున్నాగ దేశాలు ఇరుగు పొరుగున వున్నవి. చాలాకాలంగా రెండు దేశాలకూ పడడంలేదు. అందుకు కారణం జయచంద్రుడి అసూయ! ఉదయనుడు సమర్థుడైన పాలకుడు.

స్వయంవరం ముగియగానే జయచంద్రుడు పెద్దగా అరుస్తూ, చంపావతి ఎందుకూ పనికిరాని అసమర్థుణ్ణి వరించడం, తనకు బాధగా వున్నదన్నాడు. స్వయంవరం అంతా, ఒట్టి మోసపు తతంగమన్నాడు. మిగతా రాజకుమారులు, యీ మోసాన్ని సహించకూడదన్నాడు.

ఈ మాటలు విని ఉదయనుడి పరివారం బాగా ఆవేశపడ్డారు. తక్షణం జయచంద్రుడికి బుద్ధిచెప్పాలన్నారు. స్వయంవరానికి వచ్చిన చాలామంది రాజకుమారులు కూడా, జయచంద్రుడి ప్రవర్తనకు చీదరించుకున్నారు. అయినా, ఉదయనుడు మాత్రం ఆవేశపడకుండా, "జయచంద్రా, నువ్వొక రాజ్యానికి అధినేతవు. నీ కిన్ని మాటలెందుకు? సమర్థుడు తన ప్రతాపాన్ని మాటల్లో కాక, చేతల్లో చూపిస్తాడని, నీకు తెలియదు కనకనా?" అన్నాడు.

ఈ మాటలకు అక్కడున్న వాళ్ళంతా నవ్వారు. ద్వంద్వయుద్ధంలో ఉదయనుడికి

"వసుంధర"

సాటిరాగలవారు లేరన్న ఖ్యాతి వున్నది.. అందువల్ల జయచంద్రుడు అప్పటికేమీ మాట్లాడకుండా వూరుకుని, తన రాజ్యానికి తిరిగి వెళ్ళి, యుద్ధ ప్రయత్నాలు ప్రారంభించాడు.

ఈ వార్త చారుల ద్వారా ఉదయనుడికి చేరింది. ఉదయనుడికి యుద్ధం యిష్టం లేదు. అయినప్పటికీ తనూ యుద్ధప్రయత్నాలు చేస్తూనే, యుద్ధ నివారణకు ఏం చేయాలా అని ఆలోచించసాగాడు. ముందుగా జయచంద్రుడికి రాయబారం పంపడం మంచిదని అతడికి తోచింది. వెంటనే ఒక రాయబారిని పంపాడు.

"జయచంద్రా! కలహం నీకూ, నాకూ మధ్య. అలాంటప్పుడు రెండు దేశాల మధ్య యుద్ధం తెచ్చిపెట్టి, ఎందరో అమాయక ప్రజల చావుకు కారణంకావడం నా కిష్టం లేదు. కనక, యుద్ధప్రయత్నాలు మానవలసిందిగా కోరుతున్నాను."

ఈ రాయబారం విని జయచంద్రుడు పెద్దగా నవ్వి, రాయబారిని అవమానించాడు. జయచంద్రుడి మంత్రి మాత్రం, "ప్రభూ! ఉదయనుడు పిరికిపంద కాదు. ఈ విషయం మీరూ ఆలోచించండి. మన ప్రజలు కూడా ఉదయనుణ్ణి ద్వేషిస్తూంటేనే, మనం పున్నాగదేశంపై యుద్ధానికి వెళదాం," అన్నాడు.

జయచంద్రుడికి ఒకరోజు చంపావతి నుంచి రహస్యలేఖ ఒకటి అందింది. దానిలో యిలా వున్నది: "స్వయంవరంలో






ఉదయనుణ్ణి వరించడం పొరబాటని యిప్పటికి గ్రహించాను. అయినా, మించి పోయింది లేదు. పున్నాగదేశపు రాణిగా నాకు కోటలోని ఆయువుపట్లన్నీ తెలుసు. నువు, నన్ను రాణిగా చేసుకుంటానంటే, నిన్ను పున్నాగదేశపు రాజును చేస్తాను. నీ కోసం సరిహద్దు అడవుల్లో వేచి వుంటాను.''

మూర్ఖుడైన జయచంద్రుడు యీ లేఖను మంత్రికి కూడా చూపించకుండా, కొద్ది పరివారంతో సరిహద్దు అడవుల్లోకి వెళ్ళి, అక్కడ ఉదయనుడికి బందీగా దొరికి పోయాడు. ఉదయనుడు, జయచంద్రుణ్ణి సగౌరవంగా రాజభవనానికి తీసుకువెళ్ళి, అక్కడ విడిదిలో అన్ని సౌకర్యాలూ ఏర్పాటు చేశాడు.

తరవాత ఉదయనుడు, సునాగదేశపు మంత్రికి యీ విధంగా లేఖ రాశాడు: ''మీ రాజు జయచంద్రు డిప్పుడు నా దగ్గిర బందీగా వున్నాడు. ఈ సంగతి మీరు రహస్యంగా వుంచండి. మీ రాజుకు ఎలాంటి హానీ జరగదు. ఆయన కొంతకాలం మా అతిథిగా వుండి, మీ దేశం తిరిగొస్తాడు. ఈలోగా మీరు యుద్ధప్రయత్నాలు మాని, ప్రజోపయోగకరమైన కార్యాలు చేయండి. జయచంద్రుడు ప్రజల్లో నాటిన విష బీజాలు తొలగించి, ఇరుగు పొరుగు దేశాల మధ్య స్నేహ సంబంధాలు వృద్ధి అయేలా ప్రయత్నించండి. ఇప్పుడు యుద్ధం జరిగితే, కొన్ని వేల కోట్ల ప్రజాధనం నష్టమవుతుంది. మీ దేశంలో ప్రజాసంక్షేమ కార్యక్రమాలు చేపట్టడానికి, మా దేశం తరఫున పదికోట్ల వరహాలు కానుకగా యివ్వగలను. ఇది, మన రెండు దేశాల మధ్య యుద్ధాన్ని ఆపినందుకు మీకు ప్రతిఫలం.''

ఈ లేఖ చదివి జయచంద్రుడి మంత్రి చలించిపోయాడు. ఉదయనుడి మంచితనం ఆయనకు అర్థమైంది. వెంటనే ఆయన రాజు లేడన్న విషయాన్ని బయటికి పొక్కనీయకుండా, రాజ్యపాలన కొన

సాగించాడు. అంతేకాక, ఉదయనుడు పంపిన డబ్బుతో ఉదయనుడి పేరిట ఎన్నో ప్రజాసంక్షేమ కార్యక్రమాలారంభించాడు.

ఉదయనుడు, జయచంద్రుణ్ణి ఆరు మాసాల పాటు తనకు బందీగా వుంచుకున్నాడు. ఈ కాలంలో అతడికి ఎన్నో హితబోధలు చేశాడు. అతణ్ణి వదిలిపెట్టే ముందు తాను మంత్రికి పంపిన లేఖ గురించి వివరించి, "నువ్వు, నాకు బందీవన్న సంగతి అతిరహస్యంగా వుంచబడింది. నువ్వు మారువేషంలో నీ దేశం ప్రవేశించు. నీ ప్రజలు నన్ను గురించి ఏమనుకుంటున్నారో నువ్వే స్వయంగా విను. వాళ్ళు, నన్ను ద్వేషిస్తూంటే మనం యుద్ధం చేద్దాం. లేనిపక్షంలో మనిద్దరం మాత్రం ద్వంద్వ యుద్ధానికి తయారవుదాం," అన్నాడు.

జయచంద్రుడు మారువేషంతో తన దేశం ప్రవేశించాడు. ఎక్కడ చూసినా ఉదయనుడిని గురించిన స్తోత్రపాఠాలే వినబడుతున్నవి. ఉదయనుడి పేరిట రాజ్యంలో ఎన్నో బావులు, చెరువులు, ధర్మశాలలు, ఉచిత వైద్యశాలలు వెలిశాయి. సునాగదేశపు ప్రజలంతా యిప్పుడు పున్నాగదేశం పట్ల స్నేహభావంతో వున్నారు.

జయచంద్రుడు రాజధాని చేరుకుని, మంత్రిని కలుసుకుని, "ఏమిటిదంతా?" అని అడిగాడు.



తమ రాజు తిరిగి వచ్చినందుకు మంత్రి ఎంతగానో సంతోషించి, "ప్రభువులు క్షేమంగా వచ్చారు. ఉదయనుడు అన్న మాట నిలబెట్టుకున్నాడన్న మాట!" అంటూ ఎంతగానో శ్లాఘించాడు.

దానికి జయచంద్రుడు కోపగించుకుని, "నా శత్రుదేశపు రాజుకు స్తోత్రపాఠాలు పలుకుతావా? నువ్వు రాజద్రోహివికావా?" అన్నాడు.

"ప్రభూ! ప్రజలుంటేనే కదా, రాజుకు మనుగడ. యుద్ధం ప్రజల మనుగడకే ముప్పు తెస్తుంది. ఈ ఆరు మాసాల్లో నే నెన్నో ప్రజోపయోగకరమైన పనులు చేయగలిగాను; యుద్ధ ప్రయత్నాలు మానడం వల్ల పొదుపైన డబ్బులో కొంత భాగం ఉదయనుడు మనకు పంపాడు. దానివల్ల ఎన్నో మంచి పనులు జరిగి, మన ప్రజలు సుఖపడుతున్నారు. మీరు అవమానకరంగా మాట్లాడినా సహించడమే కాక, మిమ్మల్ని బందీగా పట్టుకుని కూడా, మన రాజ్యాన్ని ఆక్రమించే ప్రయత్నం ఉదయనుడు చేయలేదు. ఆయన గొప్పతనాన్ని నాతోపాటు, తమరూ ఎందుకంగీకరించరు?" అన్నాడు మంత్రి.

తన దేశం సుభిక్షంగా వుండడం కళ్లారా చూసిన జయచంద్రుడికి, మంత్రి మాటలతో జ్ఞానోదయమైంది. ఆయన ఉదయనుడికి అప్పటికప్పుడే ఒక లేఖ రాసి పంపాడు: "మిత్రమా! నా ప్రజలు నా కంటె ఎక్కువగా, నిన్నే అభిమానిస్తున్నారు. ప్రజల మనసు మార్చడం, రాజు చేతిలో పని అని నువ్వు నిరూపించావు. నే నిప్పుడు, నీ దేశంతో యుద్ధానికి గాని, నీతో ద్వంద్వ యుద్ధానికి గాని తలపడబోవడం లేదు. నిన్ను, నా దేశానికి ఆహ్వానిస్తున్నాను—స్నేహపూర్వకమైన ఆలింగనం కోసం."

ఉదయనుడు ఆ లేఖ చదివి ఎంతగానో సంతోషించాడు. ఆ తరవాత సునాగ, పున్నాగదేశాల మైత్రి తరతరాలుగా వర్ధిల్లింది.






## 13

[గుహలో దాగివున్న సమరసేనుణ్ణి, వ్యాఘ్రదత్తుడి భటులు హఠాత్తుగా మీదపడి బంధించారు. వ్యాఘ్రదత్తుడు అతణ్ణి శాక్తేయుడిని గురించీ, అతడి త్రిశూలాన్ని గురించీ ప్రశ్నించాడు. ఆ సంగతులు తెలియవని చెప్పిన సమరసేనుణ్ణి, వ్యాఘ్రదత్తుడు చంప నిశ్చయించాడు. కాని, ఆ రాత్రి యిద్దరు కొత్తవాళ్ళు సమరసేనుణ్ణి బంధవిముక్తుణ్ణి చేశారు. తరవాత—]

సమరసేనుడూ, అతణ్ణి చెర నుంచి విడిపించిన యిద్దరు సైనికులూ పల్లె చేరేసరికి, అక్కడి పరిస్థితి గందరగోళంగా వున్నది. విచ్చుకత్తులు ధరించిన వ్యాఘ్రదత్తుడి భటులు, పల్లెలోని ఇళ్లను గాలిస్తున్నారు. పల్లెవాసులు భయపడి కొండలకేసీ, అడవులకేసీ పారిపోతున్నారు.

''శివదత్తుడెక్కడ? చెప్పండి!'' అని భీకరంగా అరుస్తూ, భటులు దొరికినవాళ్లను ప్రశ్నిస్తున్నారు. మాకు తెలియదన్న వాళ్ళను, నానా హింసలూ పెడుతున్నారు.

కొంతదూరాన వుండగానే సమరసేనుడికీ, అతడి వెంట వున్నవాళ్ళకూ, ఈ భయంకర దృశ్యం కంటబడింది. వాళ్లు సరాసరి పల్లెలో ప్రవేశించకుండా దాపుల వున్న చెట్ల చాటున దాక్కుని యిదంతా గమనించసాగారు.




శివదత్తుడెవరు ? అన్న అనుమానం కలిగింది, సమరసేనుడికి. అతడు సైనికులను, "ఈ శివదత్తుడెవరో మీకు తెలుసా ? అతడి కోసం పల్లెవాసుల్ని బాధిస్తున్న, యీ భటులు వ్యాఘ్రదత్తుడి ముఠాలోని వాళ్ళేగదా ?" అని అడిగాడు.

"వాళ్ళు వెతుకుతున్న శివదత్తుడు, మా నాయకుడు. మిమ్మల్ని ఆయన ఆజ్ఞ కారణంగానే చెరనుంచి విడిపించి తీసుకు వస్తున్నాం. పల్లెనంతా భీభత్సపరుస్తున్న వాళ్ళు, వ్యాఘ్రదత్తుడి భటులు," అని సైనికులలో ఒకడు జవాబు చెప్పాడు.

ఈ జవాబు సమరసేనుడికి సంతృప్తి కలిగించకపోగా, చాలా ఆశ్చర్యం కలిగించింది. శివదత్తుడు, తన నుంచి ఎలాంటి సహాయం పొందేందుకు, తనను చెర నుంచి విడిపించాడో, అతడికి అర్థం కాలేదు. అంతేకాక, ఈ శివదత్తుడికీ, వ్యాఘ్రదత్తుడికీ మధ్య విరోధ కారణం ఏమిటో తెలియలేదు.

సమరసేనుడు, పక్కన వున్న యిద్దరు సైనికుల్నీ, "అయితే, యిప్పుడు మనం చేయవలసిందేమిటి ?" అని అడిగాడు.

సైనికులిద్దరూ మౌనంగా ముఖముఖాలు చూసుకోసాగారు. వాళ్ళు ముందు కర్తవ్యం ఏమిటో తెలియక గొడవ పడుతున్నట్టు అర్థమవుతున్నది.

కొంచెంసేపు ఏదో ఆలోచిస్తూ వూరుకుని, తరవాత సైనికుల్లో ఒకడు, "అయ్యా, శివదత్తుడు మిమ్మల్ని యిక్కడికి తీసుకు రమ్మన్నాడు. ఆయన, మీతో స్నేహం చేయదలిచే మమ్మల్ని, యీ పనికి ఆజ్ఞాపించాడు. కాని, ఆయన వుంటున్న యీ పల్లె రహస్యం వ్యాఘ్రదత్తుడికి తెలిసిపోయినట్టుంది. అందువల్లనే అతడి భటులు పల్లెనంతా గాలిస్తున్నారు. శివదత్తుడు ముందుగానే ప్రమాదం రానున్నదని గ్రహించి, మరెక్కడికైనా పారిపోయివుంటాడు," అన్నాడు.

శివదత్తుడు యీ పల్లె నుంచి మరెక్కడికి పారిపోయి దాక్కున్నాడో తెలిస్తే

తప్ప, లేకపోతే తాము ప్రమాదంలో చిక్కుకోగలమని సైనికులూ, సమర సేనుడూ గ్రహించారు. ఈ పరిస్థితుల్లో తాము ఏమి చేయడమా అని ఆలోచిస్తున్నంతలో, వెనకనుంచి సన్నని ఈల ఒకటి వినబడింది. దూరంగా చెట్టుకొమ్మ మీద దాగి వున్న ఒక వ్యక్తి, వాళ్ళ కేసి చేయి వూపుతూ, ఈల వేస్తున్నాడు.

చెట్టుకొమ్మల్లో వున్న ఆ మనిషి తమకు మిత్రుడా, శత్రువా అన్న సందేహం కలిగింది సమరసేనుడికి. కాని, తను యీ ప్రాంతాలకు కొత్తకావడంవల్ల, తన వెంట వున్నవాళ్ళిద్దరూ, ఎలా చేయమంటే, అలా చేయడం తప్ప, మరొక మార్గాంతరం లేదనుకున్నాడు.

సమరసేనుడి వెంట వున్న సైనికులలో ఒకడు పెద్దగా ఈల వేశాడు. అందుకు జవాబుగా చెట్టుకొమ్మల్లో దాగివున్నవాడు, రెండుమార్లు ఈల వేసి, దగ్గిరకు రమ్మన్నట్టు చేయి వూపాడు.

"అతడు మనకు మిత్రుడే. రహస్య సంకేతం గ్రహించాడు. అది, ఒక్క శివదత్తుడి అనుచరులకు తప్ప, మరెవరికీ తెలియదు. ఇక లేవండి, పోదాం," అన్నాడు సైనికుడు.

సమరసేనుడూ, సైనికులూ తాము దాక్కున్న ప్రదేశం నుంచి, ఆ కొత్తవాడు కూర్చునివున్న చెట్టు దగ్గిరకు వెళ్ళారు. వీళ్ళను చూస్తూనే, వాడు చెట్టుకొమ్మల్లోంచి దిగివచ్చాడు.






ఈయన సాధ్యమైనంత త్వరలో శివదత్తుణ్ణి కలుసుకోవాలి. ఆయన ఎక్కడ వున్నదీ నీకు తెలుసా?'' అని అడిగాడు ఒక సైనికుడు.

అందుకు ఆ కొత్తవాడు, ''ఆయన ఎక్కడ వుండేదీ నాకు తెలియబరచలేదు. కాని, యీ పటం వున్న కాయితం నా చేతి కిచ్చాడు. ఇందులో ఆయన వుండే స్థలం గుర్తుపెట్టానని చెప్పాడు. దీన్ని మీరు పరిశీలించడం మంచిది. నా కర్థంకావడం లేదు,'' అంటూ చుట్టగా చుట్టి వున్న ఒక కాయితాన్ని, దుస్తుల్లో నుంచి తీసి సమర సేనుడి కిచ్చాడు.

కొత్తవాడు పల్లె కేసి కొంచెం సేపు చూసి, ''మీ కోసమే శివదత్తుడు నన్నిక్కడ కావలి వుంచాడు. ఇవ్వాళ వేకువజామునే వ్యాఘ్రదత్తుడి భటులు గ్రామాన్ని ముట్ట డించారు. ఆ సంగతి ముందుగానే శివ దత్తుడు వేగుల వల్ల తెలుసుకుని, తన అనుచరులతో పారిపోయాడు,'' అన్నాడు.

వాడి మాటలు విన్నాక అందరికీ ప్రాణం తెప్పరిల్లినట్టయింది. కాని, శివ దత్తుడు యిప్పుడెక్కడున్నాడు? అతణ్ణి కలుసుకోవడం ఎలా అన్న ఆలోచన వాళ్ళకక్కలిగింది.

''ఈయన సమరసేనుడు. వ్యాఘ్ర దత్తుడి నుంచి విడిపించుకు వస్తున్నాం.

సమరసేనుడు ఆ కాయితాన్ని విప్పి, పరీక్షించి చూశాడు. అందులో కొండల్లో పాడుపడినట్టున్న కొన్ని గృహాలూ, బావులూ, కొలనులూ చిత్రించబడి వున్నవి. ప్రతి చిత్రం కిందా, దాని పేరు కూడా స్పష్టంగా రాసి వున్నది. కాని, శివ దత్తుడు ఎక్కడ దాగి వున్నాడో మాత్రం తెలుసుకునేందుకు, అందులో ఏ విధమైన గుర్తులూ లేవు.

''శివదత్తుడు కొండల్లో పాడుపడి వున్న, ఈ గృహాల కేసి పారిపోయాడు. ప్రమాదంలో చిక్కుకున్న అతడు, యిలాంటి చోటుకు పోవడంలో వున్న అర్థ మేమిటో నాకు తెలియడం లేదు. మనం

అక్కడికి వెళ్ళక తప్పదు,'' అన్నాడు సమరసేనుడు.

ఇందుకు అందరూ అంగీకార సూచకంగా తలలూపారు. పోతే, ఆ పటాన్ని బట్టి, ఆ చోటుకు దారితీయవలసిన బాధ్యత సమరసేనుడి మీద పడింది. అతడొకసారి దాపులనున్న పల్లె కేసి చూశాడు. పల్లె అంతా తగలబడిపోతున్నది. వ్యాఘ్రదత్తుడి భటులు కేకలు వేస్తూ, వినోదిస్తున్నట్టుగా గంతులు వేస్తున్నారు.

అదిచూసి సమరసేనుడికి విపరీతమైన కోపం వచ్చింది. కాని, తన దగ్గిర వున్న కొద్దిమంది సైనికులతో, వ్యాఘ్రదత్తుడి భటులను ఎదిరించడం ప్రమాదమని అతడికి తోచింది. వెంటనే బయలుదేరి శివదత్తుణ్ణి కలుసుకోవాలి. అతడి ద్వారా తాను తెలుసుకోవలసిన ముఖ్య రహస్యం ఏదో వుండకపోదు....

సమరసేనుడు యిలా ఆలోచించి, పటం కేసి ఒకసారి పరీక్షగా చూసి, సైనికులకు ముందుండి దారితీశాడు. పటంలో సూచించిన దిక్కుల ననుసరించి .జాగ్రత్తగా వెళ్ళవలసి వున్నది. అంతేకాక, మార్గమధ్యంలో వ్యాఘ్రదత్తుడి భటుల బారి పడకుండా జాగ్రత్తపడాలి.

కొంత దూరం అడవిలోంచి నడిచి, అందరూ ఒక కొండ ప్రాంతం చేరుకు




న్నారు. ఆ ప్రదేశమంతా చిన్నా, పెద్ద కొండలతో ఎగుడు దిగుడుగా వున్నది. ఎటుచూసినా కాలిబాటల ఆనవాళ్ళుగాని, జననివాసాలుగాని కనబడలేదు.

సమరసేనుడు ఒక మిట్టప్రదేశం ఎక్కి చుట్టూ కలయచూశాడు. కొండ దిగువున చిన్న, చిన్న కనుమలు మాత్రం కనిపించాయి. ఒకచోట కొంత సమతల ప్రదేశం కానవచ్చింది. ముందు ఆ ప్రదేశాన్ని చేరితే, బహుశా ఆ తరవాత వెళ్ళవలసిన మార్గం తెలియవచ్చునన్న ఆశకలిగింది సమరసేనుడికి. ఏది ఏమైనా తాను పటంలోని గుర్తులను అనుసరించి శివదత్తుణ్ణి చేరడం, కష్టసాధ్యం అనుకున్నాడు.

అందరూ కొండ మీది నుంచి కిందికి దిగారు. ఆ ప్రదేశమంతా పెద్ద, పెద్ద బండ రాళ్ళతో, గజిబిజిగా వున్న ముళ్ళపొదలతో భీకరంగా వున్నది. పటంలో శివదత్తుడు గుర్తు పెట్టిన పాడుబడిన గృహాలు గాని, మార్గం సూచించే గుర్తులు గాని లేవు.

సమరసేనుడూ, సైనికులూ మరికొంత ముందుకు వెళ్ళేసరికి, వాళ్ళకు ఆశ్చర్యంతో పాటు భయం కూడా కలిగించే ఒక దృశ్యం కంటబడింది.

ఎత్తయిన ఒక కొండ అంచునుంచి పెద్ద జలధార ఒకానొక రాక్షసుడి నోట్లో నుంచి, పెద్దధ్వనితో కిందికి పడుతున్నది. కొండరాతిలో, ఆ రాక్షసాకారంతో వున్న తల చక్కగా మలచబడింది. చూసే వాళ్ళకు ఆ జలధార భయంకరమైన రాక్షసుడి తలలో పుట్టి, బయటికి దూకుతున్నట్టు కనబడుతున్నది.

"ఇది చాలా వింతగా వున్నది. ఈ చుటుపక్కల ఎక్కడా మానవ నివాసాలే వున్నట్టు కనిపించటంలేదు. కాని, కొండ రాతిలో ఈ రాక్షసుడి శిరస్సు చెక్కిన వాళ్ళు ఎవరో మానవులే అన్నదానికి సందేహం లేదు," అంటూ సమరసేనుడు చాలా ఆశ్చర్యపడ్డాడు.

సైనికులు ఆ భయంకర దృశ్యం చూస్తూ, మౌనంగా వూరుకున్నారు.



పరీక్షగా చూసినప్పుడు, ఆ జలపాతానికి వెనక ఒక సొరంగం వున్నట్టు కనబడుతున్నది. బహుశా, శివదత్తుడు దాని నుంచే పారిపోయి వుండవచ్చునన్న అనుమానం కలిగింది, సమరసేనుడికి. ఆ వెనక వున్నది చాలా సురక్షితమైన ప్రదేశమూ, ఎవరూ అనుమానించే అవకాశం లేనిదై వుండవచ్చు.

సమరసేనుడు శివదత్తుడు పంపిన పటం కాయితాన్ని మరొకసారి పరీక్షించాడు. అందులో ఒకచోట జలపాతం గుర్తు కనిపించింది. దానితో అతడికి తను అనుమానించినది, నిజమని తెలిసిపోయింది. సైనికులు వెంటరాగా అతడు

మోకాటి లోతు నీటిలో నడిచి, జలపాతం వెనక వున్న సొరంగంలోకి జొరబడ్డాడు.

సొరంగమార్గం కొంతదూరం వరకూ కటిక చీకటిగా వున్నది. సమరసేనుడు భయపడి వెనుదిరగక, మరికొంత దూరం నడిచే సరికి, సన్నని వెలుగు కనిపించింది. ఆ తరవాత కళ్ళు మిరుమిట్లు కొలిపే సూర్యకాంతిలో ఒక సమతలంగా వున్న ప్రదేశం కంటబడింది.

సమరసేనుడూ, సైనికులూ సొరంగం నుంచి బయటికి వచ్చారు. అక్కడ వాళ్ళకు నెమళ్ళు గుంపులు, గుంపులుగా కనబడినై. వాటిలో కొన్ని నాట్యం చేస్తున్నవి. మరికొన్ని గాలిలో ఎగురుతూ కేకలు పెడుతున్నవి.

"ఇన్ని నెమళ్ళను ఒకే ప్రదేశంలో, నేనెక్కడా చూడలేదు!" అన్నాడు సమరసేనుడు ఆశ్చర్యపోతూ. అతడి వెంట వున్న సైనికులు కూడా, యిలాంటి జలపాతాలను గాని, ఈ నెమళ్ళ గుంపులను గాని ఎన్నడూ చూసి వుండలేదు.

వాళ్ళు కొద్ది సేపటికి ఒక పెద్ద కొండ గుహను సమీపించారు. హఠాత్తుగా వాళ్ళకు ఏనుగు ఘీంకరించిన శబ్దం వినబడింది.

అందరూ ఎటు పోవడమా అని దిక్కులు చూస్తున్నంతలో, గుహలో నుంచి ఒక ఏనుగు వేగంగా బయిటికి దూకింది.

ఏనుగు ఘీంకరిస్తూ రావడం చూస్తూనే సమరసేనుడూ, సైనికులూ భయకంపితులైపోయి చెల్లాచెదురుగా పారిపోయారు. కొద్దిదూరం పరిగెత్తి సమరసేనుడు ఒక పెద్దరాయి వెనక దాక్కున్నాడు. ఏనుగు అంత హఠాత్తుగా సొరంగం నుంచి బయిటికి దూకటమంటే, అది అక్కడ ఏదో ప్రబల శత్రువు నుంచి ప్రమాదాన్ని శంకించి వుండాలి!

సొరంగంలో ఏనుగునే హడలెత్తించిన ప్రాణి ఏమిటి? పటంలో సూచించిన గుర్తుల్ని తాను సరిగా అర్థం చేసుకోలేదేమో అన్న అనుమానం కలిగింది, సమరసేనుడికి. —(ఇంకావుంది)





# కనువిప్పు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ఎవరి కోసం ఇలా శ్రమపడుతున్నావో తెలియదు. పరీక్షకు నిలబెట్టితే ఎవరి కోసమూ ఎవరూ ఎలాటి త్యాగమూ చెయ్యరు. ఇందుకు తార్కాణంగా నీకు శ్రీపుర రాజకుమారుడు కామపాలుడి వృత్తాంతం చెబుతాను. శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

శ్రీపురం రాజు గుణవర్ధనుడు. అతని కొడుకు కామపాలుడు జబ్బుపడి, మంచం పట్టాడు. రాజవైద్యులు ఎంతో శ్రద్ధగా ఎక్కడలేని మందులూ తయారుచేసి అతనికి చికిత్స చేశారు. మంత్రవైద్యులు మంత్రాలు వేశారు. తాంత్రికులు తంత్రాలు

## బేతాళ కథలు



చేశారు. కాని రాజకుమారుడు నానాటికీ క్షీణించసాగాడు.

ఆ సమయంలో ఒక బౌద్ధభిక్షువు ఎవరో పంపినట్టుగా రాజభవనం ప్రవేశించాడు. రాజు అతన్ని సాదరంగా ఆహ్వానించి, "మహాత్మా, సాక్షాత్తూ బుద్ధభగవానుడిలాగా సమయానికి వచ్చారు. నా కొడుకును మృత్యుముఖం నుంచి కాపాడండి," అని వేడుకున్నాడు.

"రాజా, నీ కుమారుడు మరణశయ్యమీద ఉన్నాడనీ, ఆ విచారం మూలంగా దివాణంలో అందరూ తమ పనులు ఉపేక్షించి, దేశంలో పరిపాలన స్తంభించిపోయేటట్టు చేశారనీ తెలిసింది. నీ కుమారుడు బతకాలని ఎవరు కోరినా బతుకుతాడు. అందుకు సందేహం లేదు," అన్నాడు బౌద్ధసన్యాసి.

"అదేమిటి, స్వామీ? నా కొడుకు బతకాలని కోరనివాళ్లు ఈ దేశంలో ఎవరూ లేరు. అందరమూ వాడి ఆయువే కోరుకుంటున్నాం!" అన్నాడు రాజు.

"కోరుకున్నంతమాత్రాన లాభంలేదు. రాజకుమారుడు బతకాలని కోరుకునేవాళ్లు తమ ఆయువు అతనికి ధారపోసి, అతనికి బదులుగా తాము చావటానికి సిద్ధపడాలి!" అన్నాడు బౌద్ధసన్యాసి.

సన్యాసి ఇలా అనగానే అందరిమీదా నిశ్శబ్దం ఆవరించింది. కాని అందరి మనసులూ అతివేగంగా ఆలోచిస్తున్నాయి.

రాజు ఇలా అనుకున్నాడు:

"ఒకరి ఆయువు ఇంకొకరికి ధారపోయటం అన్నది సాధ్యమా? ఇది నమ్మదగినదేనా? ఇది నిజమే అయి, మాటవరసకు నా ఆయువు నా కొడుక్కు ధారపోసి, నేను కన్నుమూస్తే, ఈ పసివాడు ఎప్పటికి పెరిగి పెద్దవాడై రాజ్యభారం వహించాలి? అంతదాకా వాడి యోగక్షేమాలు ఎవరు చూస్తారు? నేను పోయిన మరుక్షణం వాడి చుట్టూ ఎన్ని కుట్రలు అరంభంకావు? నా కొడుకు కోసం నేను చావటం నిశ్చయంగా నిరర్థకం అవుతుంది!"

రాణి ఇలా అనుకున్నది : "నా చిట్టి తండ్రి నా ఆయువు పోసుకుని బతికితే సంతోషమే! కాని నేను పోగానే రాజు ఇంకో పెళ్ళి చేసుకుంటాడు. నా కొడుక్కి సవతితల్లి వొస్తుంది. రాజు కొత్తభార్యకు దాసుడై నా కొడుకు సంగతి పట్టించుకోడు. వాడికి తమ్ముళ్ళు పుట్టుకొస్తారు. రాజ్యం కోసం ఎన్ని దురన్యాయాలు జరిగేదీ అందరూ ఎరిగినదే! నేను చచ్చి నా కొడుక్కి ఆయువిచ్చి ఏం లాభం? బతికుంటే ఇంకా పిల్లలను కనే వయసే నాది!"

మంత్రి ఇలా అనుకున్నాడు :

"ఈ రాజునూ, రాజ్యాన్నీ నేను వెయ్యికళ్ళతో కనిపెట్టుతూ ఉండబట్టే సరిపోయింది గాని, రాజకుమారుడి కోసం నేను నా జీవితం బలి పెట్టితే, మరుక్షణం రాజ్యం తల్లకిందు లవుతుంది. ఈ దేశాన్ని క్షణంలో శత్రువులు అపహరిస్తారు. చుట్టుపక్కల దేశాలలో చెప్పుకుంటున్నది నా సామర్థ్యం గురించి గాని రాజుగారి దక్షత గురించి కాదు. నా కీర్తి ఇంకా పెరుగుతూండగా నేను ఈ బొట్టికాయ కోసం ప్రాణాలు అర్పించటం అవివేకం. నాకున్న భవిష్యత్తు నికరమైనది. ఈ రాజుకొడుకు భవిష్యత్తు అనుమానాస్పదం!"



సేనాపతి ఇలా అనుకున్నాడు : "నేను శ్రీపురం రాజుకోసం ఏ క్షణాన అయినా చావటానికి సిద్ధంగా ఉన్నవాణ్ణే. నేను కోరదగినది వీరమరణం. అంతే గాని ప్రాణదానం చెయ్యటం కాదు. రాజకుమారుడి సన్నిహితులందరూ మౌనంగా ఉండగా మధ్య నేను ఎందుకు కలగజేసుకోవాలి?"

దివాణంలో ఉన్న పెద్ద ఉద్యోగులు చాలా మందికి రాజకుమారుడు బతికినా, బతకకపోయినా ఒకటే. వారంతా మర్యాద కొరకు విచారం నటిస్తున్నవాళ్ళే.

బౌద్ధసన్యాసి అందరికేసీ చాలాసేపు చూసి, "చూశావా, రాజా? నువు పార

బద్ధావు. నీ కొడుకు బతకాలని కోరు కుంటున్న వాళ్ళు మీలో ఒక్కరూలేరు!'' అంటూ గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, రాజకుమారుడు పోతాడేమోనని బెంగపడు తున్న వారిలో ఒక్కడు కూడా తన ఆయువు వాడికి ఇయ్యటానికి సిదపడక పోవడానికి కారణం ఏమిటి? మిగిలిన వాళ్ళది నటన అనుకున్నా కన్నతండ్రీ, తల్లీ కూడా తమ ఆయువు తమ కొడుక్కు ఎందుకు ధారపోయలేదు? ఆపేక్షలూ, అంతఃకరణలూ వాస్తవంకాదా? అందరివీ మోసం బతుకులేనా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల బద్దలవుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఆపేక్షలూ, అంతఃకరణలూ అబద్ధం కాదు. ప్రపంచంలో ఒకరికోసం మరొకరు దుఃఖించటమూ, ఒకరి సంతోషాన్ని ఒకరు పంచుకోవటమూ, పిల్లలపట్ల పెద్దలవాత్సల్యమూ, పెద్దలపట్ల పిల్లల అభిమానమూ, ఇవన్నీ మానవ జీవితంలో వెలలేనివి; జీవితానికి అందమూ, శోభా కలిగించేవి. అయితే మనుషుల మధ్య ఉండే ప్రేమబంధాలు నిజానికి జీవితబంధాలు కూడానూ. తల్లిదండ్రులు తమ జీవితంలో భాగాలుగానే పిల్లలను ప్రేమిస్తారు. ఇంకొకరికి జీవితం ధారపోయటమంటే వారిని కూడా జీవితంతో పాటు త్యాగం చేయటమేనన్న మాట! అది ప్రేమ ఎలా అవుతుంది? ఒకరికోసం ఒకరు ప్రాణత్యాగం చెయ్యటమనేది ఉద్రేకంలో చేసేపని. బుద్ధితో ఆలోచిస్తే దానికి ప్రత్యేకమయిన విలువ ఏమీ లేదు. ఉదాహరణకు, రాజూ, రాణీ తమ కొడుకు కోసం తాము తమ ఆయుర్దాయం ధారపొయ్యటం గురించి బుద్ధి ఉపయోగించే ఆలోచించారు. అందులో స్వార్థం గాని, కుతర్కం గాని ఉన్నదనగలమా? అనలేం!'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# తెలిసివచ్చిన తప్పు

గ్రామంలో వాళ్ళా, వీళ్ళా గుడ్డలుతికే వృత్తిమాని, రంగయ్య గాడిదలను కొని, అమ్మే వ్యాపారంలో పడి సుఖంగా బతికిపోతున్నాడు. ఒకరోజున మోతుబరి రైతు సోమయ్య అతణ్ణి పిలిచి, "ఒరే, రంగా! షావుకారు సుబ్బయ్య యింటి ఎదురుగా వున్న గొడ్లచావిడి నీకు అద్దె లేకుండా యిస్తాను, అక్కడ చేరి నీ వ్యాపారం హాయిగా సాగించుకో," అన్నాడు.

సోమయ్యకూ, సుబ్బయ్యకూ పడదు. ఆ సంగతి తెలిసి వుండీ, ఉచితంగా పెద్ద గొడ్ల చావడి వస్తున్నదన్న ఆశతో రంగయ్య తన గాడిదల్ని అందులో చేర్చాడు. అవి పగలు మామూలుగానే వుండి, చీకటి పడినప్పటినుంచీ పిచ్చిగా ఓండ్రపెట్టి సుబ్బయ్య యింటివాళ్ళ నిద్ర చెడగొట్టుతూండేవి. సుబ్బయ్య, రంగయ్యను పిలిచి గాడిదల్ని మరెక్కడికైనా తీసుకు పొమ్మన్నాడు. రంగయ్య, ఉచితంగా దొరికిన గొడ్లచావడి ఎలా వదిలేదన్నాడు మూర్ఖంగా.

ఆ తరవాత కొద్దిరోజులకు విపరీతమైన గాలివానధాటికి చావడి కూలి, నాలుగు గాడిదలు చచ్చినై. రంగయ్య లబోదిబోమని, వాటిని ఊరివెలపలికి ఈడ్పించేందుకు చందాలకు బయలుదేరి, సుబ్బయ్య దగ్గిరకు వచ్చాడు.

సుబ్బయ్య ఎంతో సానుభూతి కనబరస్తూ, రంగయ్యకు నలభై రూపాయిలిచ్చాడు. రంగయ్య ఆశ్చర్యపోయి, "చచ్చిన గాడిదల్ని ఊరిబయటికి లాగించేందుకు, నాలుగు రూపాయలు సరిపోనే, నలభై యిచ్చారేమిటి?" అన్నాడు.

"ఫర్వాలేదు, ఉంచు! మళ్ళీ కొత్త గాడిదల్ని కొనకుండా వుంటావా? గాలివానరాకుండా వుంటుందా?" అన్నాడు సుబ్బయ్య.

కలవాళ్ళ తగువుల్లో తలదూర్చి నందుకు రంగయ్య లెంపలేసుకుని, చావగా మిగిలిన గాడిదల్ని తోలుకుపోయి, మరొకచోట వ్యాపారం ప్రారంభించాడు. — బీ బీ జాన్





# అతిశయం జమీందారు

రామాపురం జమీందారుకు, తాను గొప్ప ఆస్తిపరుడిననే అతిశయంతో పాటు, నలుగురిలోనూ దానపరుడనే పేరు తెచ్చుకోవాలన్న తాపత్రయం కూడా వుండేది. ఆ కారణంగా తాను పదిమందిలో వుండగా ఎవరైనా వచ్చి చేయిచాస్తే, ''ఇంటికిరా! నీక్కావలసింది పట్టుకుపోదువు గాని,'' అనేవాడు.

ప్రజలంతా జమీందారుగారి చేతికి ఎముక లేదని చెప్పుకునే వారు. కాని అసలు రహస్యం, యాచకుడు ఆయన మాటనమ్మి యింటికి వెళితే మొండి చెయ్యి ఎదురయ్యేది.

''ఏరా, సమయం సందర్భం లేకుండా నేను పదిమందిలో ఉండగా, అలా అడగవచ్చా? మరోసారి యిలా చేసినా, నేను ఏమీ యివ్వకుండా పంపేశానని ఎక్కడన్నా అన్నా, నీకే చుట్టుపక్కల మంచి నీళ్ళు కూడా పుట్టవు, జాగ్రత్త!'' అని బెదిరించి పంపేసేవాడు.

ఆ వచ్చినవాడు జమీందారు మాటలు విని కిక్కురు మనకుండా వెళ్ళిపోవడమే కాక, ఆయన యిలా అన్నట్టు ఎక్కడా చెప్పుకునేవాడు కాదు. ఈ సంగతులేవీ తెలియని జనం మాత్రం, ఆయనను గ్రామంలో జరిగే దేవుడి ఉత్సవాలకూ, శుభకార్యాలకూ పెద్దగా పిలిచి, గౌరవిస్తూండేవాళ్ళు. అంతేకాక ఆయన పనులన్నీ తమమీద వేసుకుని కష్టనష్టాలు తామే భరిస్తూండేవాళ్ళు.

ఈ విధంగా జమీందారుకు కీర్తితో పాటు, సొంతపనులన్నీ దమ్మిడీ ఖర్చు లేకుండా జరిగిపోతూండేవి.

ఒకరోజున ఆ ఊళ్ళోని వెంకయ్య అనే పేద రైతు, దారిద్ర్యంతో అల్లాడిపోతూ, భార్యాబిడ్డల్ని పోషించుకోలేక,

బొమ్మిడి అచ్చారావు

జమీందారును సాయం కోరేందుకు వెళ్లాడు. జమీందారు రచ్చబండ దగ్గిర కొలువుతీరి వున్నాడు. చుట్టూ జనం ఆయన చెప్పే మాటలకు తలలు వూపు తున్నారు. వెంకయ్య వినయంగా చేతులు జోడించి జమీందారుకు తన దారిద్ర్య బాధ గురించి విన్నవించుకున్నాడు.

జమీందారు ఎంతో జాలి కనబరుస్తూ, "అరె, యిలాంటి అవస్థల్లో వుండి కూడా యిన్నాళ్ళు నా దగ్గిరకు ఎందుకు రాలేదు? సరే, యిప్పటికైనా మించిపోయిందేం లేదు! సాయంత్రం ఇంటికొచ్చి పాడి గేదెను తోలుకుపో," అన్నాడు.

జమీందారు ఉదారబుద్ధికి వెంకయ్య పరమానందం చెందాడు.

ఆ సాయంత్రం వెంకయ్య వెళ్ళేసరికి జమీందారు వాకిట్లోనే కనిపించి కళ్ళెర్ర చేస్తూ, "ఏరా, నీ కష్టాలన్నీ ఏకరువు పెట్టడానికి, రచ్చబండ దగ్గిర వున్నప్పుడే నీకు సమయం కుదిరిందా? ఇంటికి వచ్చి అడిగితే సాయం చెయ్యకపోయే వాణ్ణా? పాడిగేదెల్ని నీకు దానం చెయ్య డానికి, అవేమన్నా ఉట్టినే దొరికేవను కున్నావా? పో, పో, మళ్ళీ ఏనాడూ యీ చాయలకు రాకు. ఈ సంగతి ఎక్కడైనా చెప్పావంటే చర్మం వలిపించేయగలను," అన్నాడు.

వెంకయ్య యీ మాట్లాడేది జమీందా రేనా అన్నట్టు ఒక్క క్షణం నివ్వెరపోయి తలవంచుకుని యింటిదారి పట్టాడు.



పేదవాడైనా వెంకయ్య స్వాభిమానం కల వాడు. ఇస్తానన్నది ఇవ్వకపోగా, జమీం దారు అంత దురుసుగా మాట్లాడి అవమా నించటం అతడికి చాలా బాధకలిగించింది.

వెంకయ్యభార్య జరిగిందంతా విని, "అదన్నమాట జమీందారు అసలు రూపం! ఇస్తానన్నాడని ఆశకొద్దీ వెళ్లావు, ఇవ్వలేదు. మాట తప్పిన పాపం ఆయ నది," అన్నది.

వెంకయ్య ఆలోచిస్తూ, చాలాసేపు వూరుకుని, చివరకు ఏదో ఒక మంచి ఉపాయం తోచిన వాడిలా తల పంకిస్తూ, "జమీందారిచ్చే పాడిగేదెతో, యీ జన్మకు మన దరిద్రం తీరిపోతుందని, నేనేం అనుకోలేదు. కాని, దానం యివ్వకపోగా అంత అవమానించినందుకు, ఆయనకు మంచి గుణపాఠం నేర్పదలిచాను," అన్నాడు భార్యతో.

ఆ మర్నాటి సాయంత్రం వెంకయ్య జమీందారుగారి పశువులు మేసే పచ్చిక బీడుకు పోయి, రెండు మంచి పాడి గేదెల్ని తోలుకుని, జమీందారు సభతీరే రచ్చబండ దగ్గిరకు బయలుదేరాడు. ఇది చూసిన పాలెకాపు, వెంకయ్య పాడిగేదెల్ని దొంగిలించుకు పోతున్నాడని చెప్పేందుకు రచ్చబండ దగ్గిరకు పరిగెత్తాడు.

ఆ సమయానికి రచ్చబండ మీద కూర్చుని వున్న జమీందారు చుట్టూ, చాలామంది గ్రామస్తులు నిలబడివున్నారు. జమీందారు ఏదో మాట్లాడుతున్నాడు. అక్కడికి ముందు వెంకయ్యా, కొంచెం వెనకగా పాలెకాపూ వచ్చారు.

వెంకయ్య, జమీందారుకు నమస్కరించి, "అయ్యా, తమరు దయతో అనుగ్రహించిన యీ పాడిగేదెల్ని, దొంగి లించా నంటున్నాడు, మీ పాలెకాపు! తమకు మనవి చేసుకుందామని వచ్చాను. నిన్న సాయంత్రం తమరు నాకు రెండు పాడిగేదెల్ని అనుగ్రహించారు గదా," అన్నాడు.

జమీందారుకు గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్టయింది.





# సుఖసంతోషాలు

సిసిలీ లోని ఒక చిన్న గ్రామంలో ఇద్దరు రైతులుండేవారు. ఇద్దరికీ ఒక్కసారే పిల్లలు కలగడంతో ఇద్దరూ కలిసి వాళ్ళకు నామకరణం చెయ్యడానికి ఏర్పాట్లు చేసుకుని, ఫ్రాంకో అనీ, జిరాల్డో అనీ పేర్లు పెట్టాలనుకున్నారు. ఆ విధంగా పిల్లలకి నామకరణం జరిగే సందర్భంలో ఇద్దరు దేవతలు వచ్చి దీవిస్తారన్న నమ్మకం వాళ్ళలో వుండేది. అంచేత, రైతులిద్దరూ భోజనాలబల్ల దగ్గర రెండు కుర్చీలు ఖాళీగా అట్టిపెట్టారు.

వాళ్ళ విందు ఆనందంగా గడిచిపోయి, చివరిదశలో వున్న సమయంలో, ఇద్దరు దేవతలు ప్రత్యక్షమయ్యారు. ఇద్దరు దేవతలలోనూ ఒకామె వృద్ధురాలు. ఆమె చక్కని చిరునవ్వు ముఖంతో ఫ్రాంకో తల్లి దగ్గర కూచున్నది. రెండో ఆమె జిరాల్డో తల్లి పక్కన కూచున్నది.

వృద్ధదేవత ఫ్రాంకో మీద చెయ్యివేసి, "ఈ అబ్బాయి నిత్యమూ హాయిగా వుండేలా ఆశీర్వదిస్తూ ఈ ''వింత వేణువు' ను బహూకరిస్తున్నాను. ఈ వేణువు ఎప్పుడు ఊదినా అతను విచారాన్ని మరిచిపోయి, సంతోషంగా వుంటాడు!'' అన్నది.

రెండో దేవత జిరాల్డో తలమీద చెయ్యి వేసి, ''నేను జిరాల్డోకి అద్భుతమైన కానుక ఇస్తున్నాను. ఈ కానుకతో ఇతను నిత్యం ఐశ్వర్యవంతుడై వుంటాడు. అతనికి డబ్బు కావలసి వచ్చినప్పుడు, ఈ తోలు సంచిని విప్పి, ''రాగి, వెండి, బంగారం'' అని అంటే చాలు, సంచిలో మూడు బంగారు నాణాలు దొరుకుతాయి. అయితే ఒకటి మాత్రం గుర్తుంచుకోండి. అలా రోజుకు ఒక్కసారే జరుగుతుంది,'' అని చెప్పింది.

ఇటలీ జానపద కథ

కానుకలు ఇచ్చేసి, దేవతలిద్దరూ మాయమైనారు.

జిరాల్డో తలిదండ్రులు తమ అబ్బాయికి లభించిన కానుకకు ఎంతో సంతోషించారు. ఫ్రాంకో తలిదండ్రులు మాత్రం నిరాశ పడ్డారు. నిత్యం సంతోషంగా వుండడం వల్ల పెద్ద లాభమేమీ వుండదనీ, ఆ సంతోషం తినడానికి గానీ, డబ్బుగా ఖర్చుపెట్టడానికి గానీ ఉపయోగ పడదనీ విచారపడ్డారు.

పిల్లలు ఇద్దరూ పెద్దవాళ్ళు కాసాగారు. ఇద్దరూ వాళ్ళవాళ్ళకు లభించిన కానుకలను వినియోగించుకుంటూ, ఆనందంగా గడుపుతున్నా, జిరాల్డోకి రోజూ లభిస్తున్న బంగారు నాణాలను చూసి, ఫ్రాంకో తలిదండ్రులు మాత్రం అసూయ పడసాగారు. జిరాల్డో తలిదండ్రులకి తాము గొప్పవాళ్ళమవుతున్నామన్న భావంతో, ఫ్రాంకో కుటుంబాన్ని నిర్లక్ష్యంగా చూడడం మొదలుపెట్టారు.

కొంత కాలానికి ఒక రాజుగారి కొలువులో ఈ యువకులకు సైనికులుగా ఉద్యోగాలు వచ్చాయి. ఆ రాజుతో యుద్ధానికి వచ్చిన శత్రురాజు, ఫ్రాంకో, జిరాల్డోలను బందీలుగా పట్టుకుని, తన తోటల్లో పనిచెయ్యమని, పంపించాడు.

ఖైదీగా వున్నా తన దగ్గర వున్న వేణువు వల్ల ఫ్రాంకోకి ఎన్నడూ దిగులు కలగలేదు. అతడు నిత్యం సరదాగా, హాయిగా వుండేవాడు. జిరాల్డో మాత్రం



రోజూ డబ్బు వస్తున్నా, సుఖాన్ని మాత్రం రుచి చూడలేకపోయేవాడు. ఒకరోజు అతను రాజు దగ్గరకు వెళ్ళి, తనని స్వేచ్ఛగా విడిచిపెట్టడానికి ఎన్ని బంగారు నాణాలు ఇవ్వాల్సి వుంటుందని అడిగాడు. ఆ మాటకి రాజుకి నవ్వొచ్చింది. ఒక సామాన్యమైన రైతు కొడుకు బంగారు నాణాల గురించి మాట్లాడుతున్నాడే, అనుకుని, అయినా చూదాం అని, "అరవై బంగారు నాణాలు ఇవ్వాలి," అన్నాడు.

"ఇరవై రోజుల్లో ఆ డబ్బు మీకు చెల్లిస్తాను," అన్నాడు జిరాల్డో. రాజుకి ఆశ్చర్యం వేసింది. ఎలా ఇస్తాడో చూడమని రహస్యంగా మనుషుల్ని పంపాడు. జిరాల్డో తోలుసంచి లోంచి నాణాలు తియ్యడం వాళ్ళు చూసి, రాజుతో చెప్పారు. ఆ వింత తోలుసంచి తన దగ్గర గనక వుంటే, తాను గొప్ప ఐశ్వర్యవంతుడిని కాగలననిపించింది, రాజుకి.

"నువ్వు అరవై నాణాలకు ఇరవై ఇంతలు ఇచ్చినా సరే, నిన్ను నేను వదిలేది లేదు. నువ్వు రోజూ తీసే ఆ మూడు బంగారు నాణాలూ నాకే ఇస్తూ వుండాలి. లేకపోతే నిన్ను తీవ్రంగా దండిస్తాను," అన్నాడు రాజు.

చేసేదిలేక, జిరాల్డో రోజూ ఆ మంత్రం చెబుతూ, బంగారు నాణాలు తీసి రాజుకు ఇవ్వసాగాడు.

అలా వుండగా, ఆ రాజు కూతురుకు జబ్బు చేసింది. ఆ జబ్బు రోజురోజుకూ



ఎక్కువ కాసాగింది. దాంతో ఆమె నిస్సారంగా దిగులుగా వుండేది. ఏమీ తినేది కాదు, తాగేది కాదు. ఎన్ని మందులూ ఆమె వ్యాధిని నయం చెయ్య లేక పోయాయి. చివరికి, మంత్రి ఒక సలహా ఇచ్చాడు: "మన ఖైదీల్లో ఫ్రాంకో అని వున్నాడు, వాడు ఎప్పుడూ ఆనం దంగా హాయిగా కనిపిస్తాడు. వాడిని అడిగితే ఏమైనా సలహా ఇవ్వగలడేమో!"

రాజు వెంటనే ఫ్రాంకోను పిలిపించి, యువరాణి విషయం చెప్పాడు. ఫ్రాంకో వేణువు తీసి, నెమ్మదిగా యువరాణి ముందు వాయించేటప్పటికి, ఆమె నిదా నంగా చిరునవ్వు నవ్వింది. తినడానికి ఏదైనా ఇమ్మని అడిగింది.

రాజు సంతోషించి, ఫ్రాంకో చేసిన సహాయానికి కృతజ్ఞతగా అతన్ని చెర నుంచి విడిచి పెట్టాడు. "బందీలందర్నీ మీరు విడిచిపెడితే, నాకు అంతకన్న మరో సంతోషం వుండదు," అన్నాడు ఫ్రాంకో.

రాజు ఒప్పుకోలేదు. ఒప్పుకుంటే జిరాల్డో దగ్గర్నుంచి రోజూ తనకి రావల సిన బంగారు నాణాలు పోతాయి! కాని, ఫ్రాంకో వదిలిపెట్టలేదు. ఎలాగైనా అందర్నీ విడిచి పెట్టమని ప్రాథేయ పడ్డాడు. చివరికి ఫ్రాంకో కోరిక మేరకు, తన కూతురు సంతోషంగా వున్నది గనక అదే చాలుననుకుని రాజు అందర్నీ విడిచి పెట్టేశాడు.

ఫ్రాంకో, జిరాల్డోలిద్దరూ తమ గ్రామా నికి బయల్దేరారు. ఒక నది దగ్గరకు రాగానే జిరాల్డో తన సంచిని తీసి, నదిలో విసిరేశాడు. ఫ్రాంకో ఆశ్చర్యంగా చూశాడు.

"ఆ సంచి నాకు అక్కర్లేదు. అది నాకు దురదృష్టాన్నే తెచ్చిపెట్టింది గాని, సంతోషాన్ని ఎన్నడూ ఇవ్వలేదు. దేవతలు నీకిచ్చిన కానుకే అన్నిటికన్న మహత్తర మైనది. మనిషికి డబ్బుకంటే, సుఖ సంతోషాలే ఎంతో అవసరం," అన్నాడు జిరాల్డో.






బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్వుడు ఆయనకు కుమారుడుగా జన్మించాడు. రాజు అతడికి మహిశాసనుడు అని పేరు పెట్టాడు. కొద్ది కాలం తరవాత రాణి మరొక కొడుకును కన్నది. ఆ శిశువుకు సోమదత్తుడని పేరు పెట్టారు.

కొడుకులిద్దరూ పుట్టిన మరి రెండు సంవత్సరాలకు రాణి కాలగతి చెందింది. రాజు మరొక వివాహం చేసుకున్నాడు. కొంతకాలానికి రాణి ఒక కుమారుణ్ణి కన్నది. ఈ వార్తవిని రాజు చాలా సంతోషించి, భార్యతో, "ఈ శుభసమయంలో ఏదైనా వరంకోరు, యిస్తాను," అన్నాడు.

"ఆ వరం అవసరమైనప్పుడు కోరుకుంటాను." అన్నది రాణి.

ఈ చిన్నరాణి కొడుకు పేరు ఆదిత్యుడు. అతడు క్రమంగా రాజోచితమైన విద్యలన్నీ నేర్చుకుంటూ యౌవనవంతుడయ్యాడు. రాణి ఒకనాడు రాజుతో, "ఆనాడు తమరిస్తామన్న వరం యిప్పుడు కోరుతున్నాను. ఆదిత్యుణ్ణి యువరాజుగా అభిషేకించండి," అన్నది.

ఈ కోరిక వింటూనే రాజు నిశ్చేష్టుడై పోయి, "నా మొదటి భార్య కుమారులిద్దరుండగా, ఆదిత్యుడికి యువరాజు పదవి ఎలా యివ్వగలను? నీ కోర్కె న్యాయసమ్మతం కాదు," అన్నాడు.

ఈ విధంగా రాజు తన కోర్కెను నిరాకరించినా, రాణి వూరుకోక, వీలయినప్పుడల్లా తన కొడుకును యువరాజును చెయ్యమని పీడించసాగింది. రాజు ఆమె తన మంకుపట్టు వదలదని గ్రహించాడు. అంతేకాక, పెద్దకుమారులిద్దరికీ ఆమెవల్ల ఏదైనా హాని జరగవచ్చునన్న శంక కూడా కలిగింది.



రాజు ఒకనాడు పెద్దకొడుకులిద్దరినీ పిలిచి, సంగతి సందర్భాలన్నీ చెప్పి, "మీరు నగరం విడిచిపోయి, కొంత కాలం పాటు మరెక్కడైనా వుండండి. నా తదనంతరం రాజ్యం మీకే చెందుతుంది గనక, అప్పుడు తిరిగి వచ్చి రాజ్య పాలనా భారం వహించవచ్చు," అని సలహా యిచ్చాడు.

తండ్రి కోరికప్రకారం మహాశాసనుడూ, సోమదత్తుడూ నగరం వదిలి, దాని పొలిమేరలను చేరేంతలో, చిన్నవాడైన ఆదిత్యుడు కూడా వెంట రావడం కంటబడింది. పెద్దవాళ్ళిద్దరూ ఎంతచెప్పినా ఆదిత్యుడు తిరిగివెళ్ళనన్నాడు. ముగ్గురూ కలిసి కొన్నాళ్ళకు హిమాలయ ప్రాంతంలోని అరణ్యాలను చేరుకున్నారు.

ఒకనాడు ముగ్గురూ ప్రయాణ బడలిక తీర్చుకునేందుకు ఒక చెట్టుకింద కూర్చున్నారు. మహాశాసనుడు, చిన్నవాడైన ఆదిత్యుడితో, "తమ్ముడూ, ఆ కనబడే చెట్ల సమీపాన కొలను కనిపిస్తున్నది. అక్కడికిపోయి నీ దాహం తీర్చుకుని, మా కోసం తామరాకుల దొప్పల్లో నీరు తీసుకురా," అని చెప్పాడు.

ఆదిత్యుడు వెళ్ళి కొలను నీటిలో దిగగానే, అక్కడ వుండే జలపిశాచి అతణ్ణి పట్టుకుని, నీటి దిగువనున్న తన ఇంటికి తీసుకుపోయింది.

ఎంతకూ ఆదిత్యుడు రాకపోయేసరికి మహాశాసనుడు, సోమదత్తుణ్ణి పంపాడు. అతణ్ణీ జలపిశాచి పట్టుకున్నది.

కొంతసేపు చూసి మహాశాసనుడు తమ్ములకేదో ప్రమాదం జరిగి వుంటుందనుకుని, కత్తి చేతబట్టి కొలను దగ్గిరకు వెళ్లాడు. అతడు కొలనులో దిగకుండా గట్టుమీదే నిలబడి, నీటికేసి పరీక్షగా చూస్తూండటం గమనించిన జలపిశాచి, అతడు తమ్ములలాగా తొందరపడి కొలనులో దిగడని గుర్తించింది.

జలపిశాచి ఒక బోయవాడి రూపంలో మహాశాసనుడి దగ్గిరకు వచ్చి, "అలా

చూస్తూ నిలబడ్డావేం ? దాహంగా వుంటే కొలనులో దిగి దాహం తీర్చుకోరాదా,'' అన్నది.

మహాశాసనుడు, ఆ సలహా వింటూనే, యిందులో ఏదో మోసంవున్నదని గ్రహించి, '' నీ వాలకం చూస్తూంటే, నా తమ్ము లిద్దరినీ నువ్వు కనబడకుండా చేశావన్న అనుమానం కలుగుతున్నది. నిజం చెప్పు,'' అన్నాడు.

'' నువ్వు కొంచెం వివేకివిలా వున్నావు. నిజం చెబుతాను. ఒక్క జ్ఞానసంపన్ను లను మాత్రం వదిలి, కొలను దగ్గిరకు వచ్చే మిగతా వాళ్ళనందర్నీ పట్టి బంధి స్తాను. అలా చేయమని కుబేరుడి అజ్ఞ,'' అన్నది జలపిశాచి.

'' అంటే, నువు జ్ఞానవంతుల నుంచి ఉపదేశం పొందగోరుతున్నావన్న మాట! నేను, నీకు జ్ఞానబోధ చెయ్యగలను. కాని చాలా మార్గాయాసంలో వున్నాను,'' అన్నాడు మహాశాసనుడు.

వెంటనే జలపిశాచం అతణ్ణి నీటి అడుగున వున్న తన ఇంటికి తీసుకుపోయి, అతిథిమర్యాదలు చేసి, ఉచితాసనంమీద కూర్చోబెట్టి, తాను అతడి పాదాల దగ్గిర కూర్చున్నది.

మహాశాసనుడు తాను గురువుల నుంచి విన్నదీ, స్వానుభవం ద్వారా తెలుసు కున్నదీ అయిన పరమజ్ఞానాన్ని గురించి జలపిశాచికి చెప్పాడు. వెంటనే జల పిశాచం బోయవాడి రూపం విడిచి, తన



నిజరూపంతో, "మహాత్మా, నువు మహా జ్ఞానివి. నీ తమ్ములలో ఒకరిని నీకు యివ్వదలిచాను. ఇద్దరిలో ఎవరు కావాలో కోరుకో," అన్నది.

"అయితే, ఆదిత్యుణ్ణి యివ్వు." అన్నాడు మహాశాసనుడు.

"పెద్దవాణ్ణి వదిలి, చిన్నవాణ్ణి కోరడం ధర్మం అవుతుందా?" అన్నది జల పిశాచి.

"ఇందులో ధర్మం కానిదేం లేదు. నా తల్లికి నేను మిగిలివుండగా, నా పిన తల్లికి ఒక కుమారుడు వుండవద్దా? నా పినతల్లి తన కొడుకైన ఆదిత్యుడి కోసమే, నా తండ్రిని రాజ్యం కోరింది. మా తండ్రి ఆజ్ఞపై మేము అడవులకు బయలుదేరాం. సోదరప్రేమ చేత అమాయకుడైన ఆది త్యుడు మా వెంట వచ్చాడు. పెద్దవాళ్ళ మైన మేము తిరిగి నగరానికి వెళ్ళినప్పుడు ఆదిత్యుడెక్కడ? అని ప్రజలు అడిగితే, అతణ్ణి జలపిశాచి మింగి వేసిందని చెప్పడం, ఏరకం న్యాయం అవుతుంది?" అని మహాశాసనుడు, జలపిశాచిని ఎదురు ప్రశ్నించాడు.

అప్పుడు జలపిశాచి, మహాశాసనుడి కాళ్ళకు నమస్కరించి, "నీ అంత గొప్ప జ్ఞానసముద్రుణ్ణి నే నింతవరకూ చూడ లేదు. నీ తమ్ములిద్దరికీ స్వేచ్ఛ యిస్తు న్నాను. ఈ అరణ్యంలో వున్నంతకాలం నాకు అతిథులుగా వుండండి," అన్నది.

మహాశాసనుడూ, తమ్ములూ జలపిశా చికి అతిథులుగా వుండిపోయారు. కొంత కాలానికి వాళ్ళ తండ్రి బ్రహ్మదత్తుడు చనిపోయినట్టు తెలిసి, మహాశాసనుడు తమ్ములతో, జలపిశాచితో కాశీరాజ్యానికి వెళ్ళాడు.

మహాశాసనుడికి రాజ్యాభిషేకం జరి గింది. అతడు సోమదత్తుణ్ణి తన ప్రతి నిధిగానూ, ఆదిత్యుణ్ణి సేనాధిపతిగానూ నియమించాడు. తనకు మేలుచేసిన జల పిశాచికి చక్కని విడిది ఏర్పాటు చేసి, దాని అవసరాలు గమనిస్తూండేందుకు నౌకర్లను నియమించాడు.






# హర్షవర్ధనుడు

పధ్నాలుగు వందల సంవత్సరాల కిందట ప్రభాకరవర్ధనుడు అనే రాజు, చిన్నదైనా సుసంపన్నమైన స్థానేశ్వర రాజ్యాన్ని పాలిస్తూండే వాడు. అతడికి రాజ్యవర్ధనుడు, హర్షవర్ధనుడు అనే యిద్దరు కొడుకులూ, రాజ్యశ్రీ అనే కుమార్తే వున్నారు. కన్యాకుబ్జ రాజైన గ్రహవర్మతో, రాజ్యశ్రీ వివాహం జరిగింది.

గ్రహవర్మ తన వధువుతో కన్యాకుబ్జకు తిరిగి వచ్చిన కొద్ది దినాలకే, మాల్వా రాజు నగరాన్ని ముట్టడించాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో గ్రహవర్మ మరణించాడు.





విజయుడైన మాల్వారాజు, రాజ్యశ్రీని బందీగా పట్టుకుని, సంకెళ్ళు వేసి, ఆమెను తన నగరానికి తీసుకుపోయాడు. ఈ దుఃఖవార్త విని రాజు ప్రభాకరవర్ధనుడూ, కొడుకులూ అత్యంత విషాదం పాలయారు.

స్థానేశ్వరపు పెద్ద యువరాజైన రాజ్య వర్ధనుడు సైన్యంతో మాల్వారాజ్యం మీద దాడి చేసి, యుద్ధంలో శత్రు రాజును ఓడించాడు. రాజ్యశ్రీ బంధ విముక్తురాలైంది. అన్నా, చెల్లెళ్ళు ఒకళ్ళనొకళ్ళు చూస్తూనే కంట నీళ్ళు పెట్టుకున్నారు. రాజ్యవర్ధనుడు తిరిగి స్థానేశ్వరానికి బయలుదేరాడు.





గౌండవన ప్రాంతాన్ని పాలించే శశాంకు డనే రాజుకు కన్యాకుబ్జనే కాక, బహుశా మాల్వారాజ్యాన్ని కూడా జయించాలనే ఆశవున్నది. అతడు సైన్యంతో దొంగ చాటుగా వచ్చి, రాజ్యవర్ధనుడి బలగం మీద పడ్డాడు. అప్పుడు జరిగిన పోరులో రాజ్యవర్ధనుడు మరణించాడు. రాజ్యశ్రీ తప్పించుకుని పారిపోయింది.

ఈ దుస్సంఘటనల మధ్య, రాజు ప్రభాకరవర్ధనుడు చనిపోయాడు. మంత్రులూ, సామంతులూ పట్టుబట్టి హర్షవర్ధనుణ్ణి రాజుగా అభిషేకించారు. తన పదహారవ ఏట హర్షవర్ధనుడు స్థానేశ్వరానికి రాజయాడు.







హర్షవర్ధనుడు రాజ్యానికి వస్తూనే, తన సోదరి రాజ్యశ్రీ కోసం అన్వేషణ ప్రారంభించాడు. అతడు ఒకానొక అరణ్యంలో ప్రవేశించి, అక్కడి క్రూర మృగాలు సాధుజంతువుల్లా మసలడం గమనించి, ఆశ్చర్యచకితుడయాడు.

ఈ వింతకు బహుశా అక్కడ దాపుల నున్న ఏ మహాపురుషుడో కారణమై వుంటాడన్న అనుమానం అతడికి కలిగింది. అతడు మరికొంత ముందుకు వెళ్ళేలోపలే కొందరు సన్యాసులు వచ్చి, హర్షవర్ధనుణ్ణి తమ గురువు దగ్గిరకు తీసుకుపోయారు. ఆ సమయంలో ఒక సన్యాసి అక్కడికి వచ్చి, అరణ్యంలో మరొక ప్రాంతాన స్త్రీ ఒకతె, అగ్ని ప్రవేశం చేసేందుకు సన్నద్ధపడుతున్న దని చెప్పాడు.





హర్షవర్ధనుడూ, గురువూ హుటాహుటిగా అక్కడికి వెళ్ళారు. ఆ స్త్రీ మరెవరో కాదు, హర్షవర్ధనుడి సోదరి రాజ్యశ్రీ. ఆమె ఆత్మత్యాగం చేసేందుకు కట్టెలు పేర్చి, అగ్ని రగుల్చుతున్నది. ఆమె అగ్నిప్రవేశం చేయనున్న ఆఖరిక్షణంలో గురువూ, హర్షవర్ధనుడూ ఆమెను సమీపించి, అగ్నిప్రవేశం చేయకుండా నివారించారు.

హర్షవర్ధనుడు తన సోదరిని స్థానేశ్వరం తీసుకువచ్చి, తనకు సంరక్షకురాలుగా వుండవలసిందని కోరి, ఒప్పించాడు. ఏదో ఒకనాడు, రాజ్యపాలనా బాధ్యతల నుంచి వైదొలగి, యిద్దరం వనవాసం చేస్తూ, ధ్యానంలో కాలం గడుపుదామని చెప్పాడు.





ఆ తరవాత కొద్దికాలంలోనే హర్షవర్ధనుడు, తన అన్నను చంపిన రాజు శశాంకుణ్ణి యుద్ధంలో ఓడించాడు. అంతేకాక, మరెందరో రాజులను జయించి, ఒక సామ్రాజ్యానికి చక్రవర్తి అయ్యాడు. రాజ్యంలోని విభిన్న మత విశ్వాసాల పట్ల సమాదరం చూపాడు.

ఆయన తన సంపదను అనేక సార్లు పండితులకూ, పేదలకూ పంచిపెట్టాడు. అలాంటి సందర్భంలో ఒకసారి తనకున్న దంతా దానం చేసి, తన సోదరి అయిన రాజ్యశ్రీ నుంచి కట్టుబట్టలు భిక్షగా స్వీకరించాడు.





# సూది తెచ్చిన సౌభాగ్యం

పూర్వం కోసల దేశంలో ముగ్గురు మిత్రులుండేవారు. వారిలో ఇద్దరు నందుడు, సునందుడు అనేవారు ధనికులు. మూడవవాడు ఆనందుడు గర్భదరిద్రుడు. అతను తాళ్ళు పేనుకొని జీవించేవాడు. అతణ్ణి ఏ విధంగానైనా ధనికుణ్ణి చెయ్యాలని నందుడూ, సునందుడూ ఆలోచన చేశారు.

"పెట్టుబడికి కొంతధనం ఉన్నట్టయితే ఎవరైనా ధనికుడు కావచ్చు. కనుక ఆనందుడికి కొంత మూలధనం ఇద్దాం," అన్నాడు నందుడు.

"ఎంతమంది ధనికులు దరిద్రులై పోవటంలేదు ? కలిసివచ్చినట్టయితే పెద్ద పెట్టుబడి లేకుండానే ధనికుడైపోవచ్చు," అన్నాడు సునందుడు.

నందుడు మర్నాడు ఆనందుడికి రెండువందల మాడలిచ్చాడు. వాటితో ఏదైనా వ్యాపారం చేసుకొని ధనం సంపాదించమని చెప్పాడు. ఆనందుడు సంతోషించి, ఆ రెండువందల మాడలలో పది ఖర్చుకుగాను తీసి, మిగిలినవి తన తలపాగాలోనే భద్రంగా మూటకట్టి, ఇంటికి కావలసిన వెచ్చాలు కొనటానికి బజారుకు బయలుదేరాడు. దురదృష్టవశాత్తూ దారిలో ఒక పక్షి ఎటునుంచో వచ్చి, ఆనందుడి తలపాగాలో మూట చూసి అందులో ఏదో ఉన్నదనుకుని తన్నుకుపోయింది. నూటతొంభైమాడలూ రెక్కలు వచ్చి ఎగిరిపోయినందుకు ఆనందుడు చాలా విచారించాడు.

తరువాత కొద్దిరోజులకు నంద సునందులు ఆనందుడి ఇంటికి వచ్చి, తమ స్నేహితుడి పరిస్థితిలో మార్పులేనందుకు కారణం అడిగారు.

"నా అదృష్టం బాగులేదు. డబ్బంతా తలపాగాలో చుట్టుకొన్నాను. కాని ఏదో

25 ఏళ్ళనాటి చందమామ కథ

పక్షి వచ్చి తలపాగా తన్నుకుపోయింది,'' అన్నాడు ఆనందుడు విచారంగా.

ఈ వృత్తాంతం నందుడు నమ్మాడు గాని సునందుడు నమ్మలేదు; ఆనందుడా డబ్బును దుర్వినియోగపరచి ఉంటాడనుకున్నాడు. నందుడు మాత్రం ఆనందుడికి మరొకసారి రెండువందల మాడలిచ్చి, ''ఈసారి అయినా డబ్బు భద్రంగా ఉంచుకొని, దాని సహాయంతో ధనం సంపాదించు,'' అని సలహా యిచ్చాడు.

ఈసారి ఆనందుడు తనకు కావలసిన మాడలు తీసుకొని, మిగిలినవి తవుడుతట్ట అడుగున భద్రంగా దాచి, బజారుకు వెళ్ళాడు. అతను తిరిగి వచ్చేసరికి తవుడు తట్ట కనబడలేదు. భార్య నడిగాడు.

''ఉప్పు అమ్మకానికి వచ్చింది. దగ్గిర డబ్బులు లేవు. అందుకని తవుడుతట్ట అమ్మి రెండు శేర్లు ఉప్పు తీసుకున్నాను,'' అన్నది ఆనందుడి భార్య.

ఆనందుడికి పట్టరాని దుఃఖం కలిగింది. తనకు డబ్బు దక్కించుకొనే యోగం లేదని అతను తేల్చుకొన్నాడు.

మరి కొద్దిరోజులకు నందసునందులు మళ్ళీ వచ్చి జరిగిన సంగతి విన్నారు. ఆనందుడు ఎప్పటికన్న దరిద్రుడుగా కనిపించాడు. అతడు బట్టల చిరుగులు కూడా కుట్టుకోలేదు, కారణమేమంటే ఇంట్లో సూది కూడా లేదని చెప్పాడు.

అప్పుడే బజారులో సూదుల పొట్లం కొన్న సునందుడు ఆనందుడికి ఒక సూది



ఇచ్చి, "ఇది పెట్టి నీ భార్యచేత చిరుగులు కుట్టించుకో!" అన్నాడు.

ఆ రోజు రాత్రే పక్కయింటి బెస్తవాడి భార్య ఆనందుడి భార్య వద్దకు వచ్చి. "అక్కా, మీ ఇంట్లో సూది వుంటే కాస్త ఇస్తావా? రేపు ఉదయమే మా వాళ్ళు వలలు పట్టుకొని చేపలు పట్టబోతున్నారు. వల బాగుచేసుకోవాలి. వలలో మొదట పడిన చేపలు మీ కిస్తాంలే!" అన్నది.

ఆనందుడి భార్య ఆమెకు ఇంట్లోవున్న సూది అరువు యిచ్చింది.

మర్నాడు సాయంకాలం చేపలతో తిరిగి వచ్చిన బెస్తవాడు తన కూతురు చేతికిచ్చి ఆనందుడి ఇంటికి పెద్ద చేపను పంపాడు. కూర వండుదామని ఆనందుడి భార్య ఆ చేపను కోసేసరికి అందులో పెద్ద గాజుముద్దలాటిది దొరికింది. ఆ గాజు ముద్దతో ఆనందుడి పిల్లలు వీధిలో ఆడు తూండగా చూసిన నగలవర్తకుడు ఆనం దుడి దగ్గిరికి వచ్చి, "ఆ గాజుముక్క నాకు అమ్ముతావా, ఆనందయ్యా? నూరు మాడలిస్తాను!" అని అడిగాడు.

అది చాలా విలువైన గాజుపెంకు అయివుండాలని అనుమానం తగిలి ఆనం దుడు దానిని అమ్మ నిరాకరించాడు. ఆరోజే దానిని నగరానికి పట్టుకునిపోయి రత్నాల వర్తకులకు చూపించాడు.

'నిజానికి అదొక అమూల్యమైన వజ్రం. దానిని పెద్ద వర్తకుడు ఇరవైవేల మాడ లిచ్చి కొనుక్కున్నాడు. ఆ ధనంతో ఆనం



దుడు ఇల్లూ, దొడ్లూ కొన్నాడు. తాళ్ళు పేనటానికి కర్రలతో యంత్రాలు చేయించాడు. తాళ్ళపరిశ్రమ ఏర్పాటు చేశాడు, ధనికుడైనాడు.

ఆనందుడు అకస్మాత్తుగా ధనికుడైన వార్త తెలియగానే అతని మిత్రులు నంద సునందులు అతనిని చూడవచ్చారు.

"నేనిచ్చిన డబ్బు పెట్టుబడి చేసే ధనికుడవయావు, అవునా?' అన్నాడు నందుడు.

ఆనందుడు జరిగినదంతా పూసగుచ్చినట్టు మిత్రులకు చెప్పాడు.

"కలిసి వచ్చేసరికి నేనిచ్చిన సూదితోనే ఆనందుడు ధనం సంపాదించాడు, చూశావా?" అన్నాడు సునందుడు.

ఈసారి నందుడికి నమ్మకం కలగలేదు. ఆనందుడు తన ధనంతోనే ధనికుడై, ఆ సంగతి కప్పిపుచ్చటానికి అబద్ధమాడుతున్నాడనుకొన్నాడు.

మిత్రులు ముగ్గురూ కలిసి ఆనందుడు కొత్తగా కట్టించిన ఇల్లూ, వెనకవున్న దొడ్డీ చూడటానికి బయలుదేరారు. వారు దొడ్లోకి వెళ్ళేసరికి ఆనందుడి పిల్లలు ఒక చెట్టు ఎక్కి దానిమీద వున్న పక్షిగూడు కింద పడేశారు అందులో ఆనందుడి తలపాగా కనిపించింది. దాని చెంగున మూట కట్టి వున్న నూటతొంభై మాడలూ దొరికాయి.

వారక్కడ నుండి బయలుదేరి గొడ్ల సావిడికి వచ్చారు. అదే సమయంలో బజారు నుంచి నౌకరు ఒకడు తవుడుతట్ట కొని తెచ్చాడు. వాడు దానిలో నుంచి తవుడు తీసి కుడితిలో పోస్తూండగా బంగారు మాడలు కొన్ని వాడి చేతిలోకి వచ్చాయి. తట్ట బోర్లించి చూసేసరికి ఆనందుడు రెండవసారి పోగొట్టుకున్న నూటతొంభై మాడలూ కూడా దొరికాయి!

ఇది చూడగానే నందుడికి ఆనందుడి మాటలలో నమ్మకం కుదిరింది. సునందుడు చెప్పినట్టు కలిసివస్తే ఐశ్వర్యం రావటానికి కుట్టుసూది అయినా చాలునని నందుడు అనుకున్నాడు.



# వ్యర్థమైన వరాలు

ఒక కటిక పేదవాడు, కుటుంబంతో సహా పస్తుండి, ఇంటికి వచ్చిన సన్యాసికి తృప్తిగా భోజనం పెట్టాడు. సన్యాసి వెళ్ళిపోతూ అతడికి రెండు మంత్రాలు ఉపదేశించి రెండూ, రెండుకోర్కెలు తీరుస్తాయని చెప్పాడు.

పేదవాడు వెంటనే ధనికుడు కావాలనే ఆశతో ఒక మంత్రాన్ని జపించి, తన ఇంటినిండా బంగారం వుండాలని కోరుకున్నాడు. అలాగే జరిగింది. కాని, పేదవాడికి ఒక భయం పట్టుకున్నది. ఇంత బంగారం తన దగ్గిర వున్నట్టు తెలిస్తే, రాజుగారు దాన్ని తీసుకుపోవటమే గాక, తనను దొంగకింద జమకట్టి, బందిఖానాలో వేసే ప్రమాదం కూడా వున్నది.

ఇలాంటి ఆలోచన రాగానే పేదవాడు రెండో మంత్రాన్ని జపించి, "ఈ బంగారం నాకు తప్ప, మరెవ్వరికీ కనిపించకూడదు!" అన్నాడు.

వెంటనే మంత్రం ఫలించింది. అతడికి తప్ప మరెవ్వరికీ కనిపించని, ఆ బంగారం ఉపయోగం లేకుండా పోయింది. పేదవాడు, పేదవాడుగానే వుండిపోయాడు. —రాంబాబు





# దొంగ-తేలు

అర్ధరాత్రివేళ మంచి నిద్రలో వుండగా, పక్కన, ''అమ్మో!'' అన్న కేక విని సుజాత ఉలిక్కిపడి నిద్ర లేచింది. తల దగ్గిర చీకట్లో ఎవరో మనిషి నిలబడి, చెయ్యి విదిలించుకుంటూ వుండడం చూసి, ఆమె గుండె జల్లుమన్నది.

ఇంట్లో ఆమె ఒక్కతే వున్నది. తండ్రి పొరుగూళ్ళో ఏదో సంబంధం వున్నదని తెలిసి, ఆ సంగతి విచారించిరావడానికి వెళ్ళాడు. వెళ్ళేముందు పనిమనిషిని కూతురుకు తోడుగా వుండమని చెప్పాడు. అయితే, అనుకోకుండా దాని భర్తకు జబ్బు చేసి, అది ఇంటికి వెళ్ళిపోయింది. సుజాతకు ఒంటరిగా వుండక తప్పలేదు. ఎవడో దొంగ, వంటగది పైపెంకులు తొలిగించి, ఇంట్లో ప్రవేశించాడు.

సుజాతకు భయంతో ఏమిచేయడానికీ పాలుపోలేదు.

దొంగ ఆమెతో, ''తొందరగా లే! నీ తల కింద పెద్ద తేలున్నది,'' అన్నాడు చేతిని బాధగా విదిలించుకుంటూ. అతను, సుజాత తల కింద తాళంచెవుల కోసం వెతుకుతుండగా, తేలు కుట్టింది.

సుజాత అందుబాటులో వున్న దీపం వత్తిని పెద్దది చేసి, చప్పున మంచం దిగింది.

దొంగ దిండును పక్కకు తోసి, అక్కడ వున్న పెద్ద నల్లతేలును కిందికి విదిలించి, చెప్పుతో కొట్టి చంపేశాడు.

సుజాతకు తేళ్ళంటే చెడ్డభయం. దొంగ సమయానికి రాకపోతే, తేలు తనను తప్పక కుట్టి వుండేదే! ఆమెకు దొంగ పట్ల కృతజ్ఞతా భావం ఏర్పడింది.

దొంగ యింకా బాధపడుతూ వుండడం చూసి, ఆమె అతడి వేలుకు కరక్కాయ అరగదీసి రాసి, పాతగుడ్డల పొగ వేసి,

మాచిరాజు కామేశ్వరరావు

వేలు మంట పోయేందుకు ఊదుతూ కూర్చున్నది.

దొంగ ఆమె కేసి చూస్తూ, "ఇంత యింట్లో ఒక్కదానివే వున్నావేం? ఒంటరిగా వుండడం ప్రమాదం అని తెలియదా," అన్నాడు.

"ఇలా ఎప్పుడూ వుండను. ఈ రోజు మా నాన్న పొరుగూరు వెళ్ళాడు. చూడబోతే, చదువుకున్నవాడిలా వున్నావు. ఇలా దొంగతనానికి ఎందుకు బయలుదేరావు?" అని అడిగింది సుజాత.

దొంగ దిగులుగా ముఖం పెట్టి, "అంతా చెబుతాను. నా పేరు మురళి. నన్ను మా అవ్వ గారాబంగా పెంచి పెద్ద చేసింది. అవ్వ మురిపం వల్ల నాకు చదువు అంతగా అబ్బలేదు. చెడు స్నేహాల కారణంగా అవ్వ పెట్టెలోంచి చిల్లర డబ్బులు దొంగిలించేవాడిని. ఆ మధ్య అవ్వ పోయింది. మా ఊరు నుంచి, యీ పట్నం వచ్చాను. ఇక్కడ ఎంత ప్రయత్నించినా, నాకు పనిదొరకలేదు. మూడురోజులుపస్తులుండి, చివరికి యీ దొంగతనానికి దిగాను," అన్నాడు.



సుజాత అతడి స్థితికి జాలిపడింది. ఇంట్లో వున్న పళ్ళు తినమని యిచ్చింది. తెల్లవారేదాకా బాధ కలగకుండా, అతడికి కబుర్లు చెబుతూ కూర్చున్నది. మురళి మంచి అందగాడు. కాని, అతడి దొంగ బుద్ధి, ఆమెకు కంపరం కలిగిస్తున్నది.

"ఉదయానే మా నాన్న వస్తాడు. నిన్ను, ఆయనకు మా స్నేహితురాలి అన్నగా పరిచయం చేస్తాను. నిరుద్యోగివనీ, ఏదైనా ఉద్యోగం యిప్పించమనీ చెబుతాను. దొరికిన పనేదో చేస్తూ, సుఖంగా కాలం గడపడానికి నీకు అభ్యంతరం వుండదనుకుంటాను," అన్నది సుజాత.

మురళి సంతోషంగా తలాడించి, సుజాత తండ్రి రాకముందే, వంటగది కప్పు పెంకులు సర్దిపెట్టేశాడు. బారెడు పొద్దెక్కాక సుజాత తండ్రి తిరిగి

వచ్చాడు. తండ్రి ముఖం చూస్తూనే, వెళ్ళిన సంబంధం కుదరలేదని సుజాత గ్రహించింది. ఆమె, తండ్రికి మురళిని తన స్నేహితురాలి అన్నగా పరిచయం చేసి, "ఉద్యోగం కోసం పట్నం వచ్చాడట," అన్నది.

సుజాత తండ్రి మాటల ధోరణిలో మురళిని రకరకాల ప్రశ్నలు అడిగి చూశాడు. మురళి జవాబులూ, అతడు వినయంగా ప్రవర్తించిన తీరూ ఆయనకు బాగా నచ్చినై. అప్పటికే సంవత్సరం నుంచి కూతురు పెళ్ళి కోసం, ఎన్నో ఊళ్ళు తిరిగి విసిగిపోయి వున్న అతడికి, మురళినే తన ఇంటి అల్లుడుగా చేసుకుంటే బావుండును గదా, అనిపించింది.

సుజాత తండ్రి, కూతురును ఒంటరిగా చూసి, "అమ్మా, యీ అబ్బాయి, నీ స్నేహితురాలి అన్న అంటున్నావు. మనిషి బావున్నాడు, మాటతీరు చూస్తూంటే, చాలా సాధువులా వున్నాడు. ఇలాంటి వాడికి ఏదైనా ఉద్యోగం యిప్పించడం కష్టం కాదు. నాకు నచ్చాడు; నీకూ నచ్చేటట్లుంటే, మీ యిద్దరికీ వివాహం చేసేస్తాను," అన్నాడు.

సుజాత, తండ్రికి ఎటూ తేల్చి చెప్పకుండా, "తొందరేముంది, నాన్నా!" అని వూరుకున్నది.

ఆమెకు, మురళి మీద యింకా పూర్తి నమ్మకం కలగలేదు. అతడు పెరిగిన వాతావరణం, చెడ్డ స్నేహితుల ప్రభావం



అంత త్వరగా వదిలేవికాదని ఆమె అను కున్నది. ఆ సాయంత్రం మురళికి తమ తోట అంతా తిప్పి చూపించింది. చీకటి పడి ఇల్లు చేరాక, ఒక పెట్టెలో వున్న నగలు అతడికి చూపించి, "ఇవి, మా అమ్మవి. మా ఇంట్లో యింతకన్న విలువైనవి మరేం లేవు," అన్నది.

ఆ రాత్రి మురళికి మరి నిద్రపట్టలేదు. అతని కళ్ళముందు సుజాత చూపించిన నగలు తళుక్కుమంటున్నాయి. ఆ నగలు ఎత్తుకుపోయి అమ్మి, ఆ డబ్బుతో హాయిగా బతకవచ్చన్న ఆలోచన అతడికి కలిగింది. అలా కాక, బతికినన్నాళ్ళూ ఒకళ్ళకింద నౌకరీ చేస్తూ కష్టపడడం ఎందుకు అనుకున్నాడు.

ఇలా ఒక నిశ్చయానికి వచ్చి మురళి ఒక రాత్రివేళ నగలపెట్టె తీసుకుని, పెరటి దారిన పారిపోయాడు. అతడు కొంతదూరం వెళ్ళి నగలపెట్టెను దగ్గిర వుంచుకోవడం ప్రమాదం అని భావించి, నగలు మాత్రం తీసుకుందామని పెట్టె తెరిచి, ఉలిక్కి పడ్డాడు. నగల మధ్య నల్ల తేలు వున్నది!

తేలు మళ్ళీ ఎక్కడ కుడుతుందో అన్న భయంతో అతడు నగలపెట్టెను చప్పున జారవిడిచాడు. నగలతోపాటు కిందపడిన తేలు కదలలేదు. అది బొమ్మ తేలని గ్రహించిన మురళి, దాన్ని పక్కకు తోసి నగలు తీసుకుంటూండగా, వాటి మధ్య ఒక చీటీ కనిపించింది. అది సుజాత రాసి నది. అందులో యిలా వున్నది :



"బొమ్మ తేలు అయినందుకు చాలా సంతోషించి వుంటావు! తేలులా కనిపించి కుట్టకపోతే ఫరవాలేదు; కాని వాన పాములా కనిపించి విషం కక్కితేనే ప్రమాదం. నిన్న నీవు దొంగలా కనిపించి హాని చేయలేదు. ఈ రోజు, ఈ ఇంటికి కాబోయే అల్లుడివయే అవకాశం వుండీ, నగలు దొంగిలించుకు పోతున్నావు. నా తండ్రికి నచ్చినా, నీ లాంటి మనిషి భర్త కాకుండా పారిపోతున్నందుకు ఆనందిస్తున్నాను."

ఉత్తరం చదివి మురళి దిగాలుపడి పోయాడు. సుజాతను పెళ్ళాడి, హాయిగా ఉద్యోగం చేసుకుంటూ సుఖంగా బతక వలసిన తను, యిలా దొంగలా జీవించ తలచినందుకు అసహ్యపడ్డాడు. వెంటనే పోయి, నగలు సుజాతకు యిచ్చి, ఆమెను క్షమాపణకోరి, తన దారిన తాను వెళ్ళి పోదలిచాడు.

మురళి తిరిగి యింటిలోకి వస్తూండగా, మంచినీళ్ళ కోసం వంటగదిలోకి వచ్చిన సుజాత తండ్రి, అతణ్ణి చూసి అనుమానంగా, "ఇంత రాత్రివేళ నగలపెట్టె తీసుకుని ఎక్కడికి వెళ్ళావు?" అని అడిగాడు.

మురళి జవాబు చెప్పేందుకు తత్తర పడుతూండగా, సుజాత వచ్చి, "నా చేతి గాజులు గుచ్చుకుంటూంటే, వాటిని నగల పెట్టెలో దాద్దామనుకున్నాను. నాన్నా. అయితే, అందులోకి ఎలాచేరిందో—ఒక తేలు చేరింది. దాన్ని చంపిరావడానికే మురళి నగలపెట్టె తీసుకుని బయిటికి వెళ్ళాడు," అన్నది.

తండ్రి అటు వెళ్ళగానే, ఆమె, మురళితో, "అలా దిక్కులు చూస్తావేం? లోపలికిరా. తేలును పూర్తిగా చంపేశావా? దేన్నయినా సగం, సగం చంపడం మహా పాపం," అన్నది నవ్వుతూ.

సుజాత తనలోని దొంగబుద్ధి అనే తేలును· గురించి అడుగుతున్నదని గ్రహించిన మురళి, ఆమె తనను క్షమించి నందుకు ఎంతగానో సంతోషించాడు.





# భర్తను దిద్దిన భార్య

పనీపాటా లేకుండా, స్నేహితులతో కబుర్లాడుతూ కాలక్షేపం చేసే జగ్గారావుకు ఒకనాడు హఠాత్తుగా ఏదైనా వ్యాపారం చెయ్యాలన్న బుద్ధిపుట్టింది. అతడి అత్త వారు కొంచెం స్థితిమంతులు. జగ్గారావు, భార్యతో, "ఇక యిలా గాలితిరుగుళ్ళతో లాభం లేదు. ఏదైనా వ్యాపారం చేద్దామనుకుంటున్నాను. పుట్టింటికి పోయి, ఒక వెయ్యి రూపాయిలు తీసుకురా," అన్నాడు.

జగ్గారావు భార్య లక్ష్మి స్వతహాగా తెలివిగలది. తాను చేయబోయే వ్యాపారం ఏదో కూడా నిర్ణయించుకోకుండా, వెయ్యి రూపాయిలంటే, ఏవో వెయ్యి గుడ్డిగవ్వలు అన్న ధోరణిలో భర్త మాట్లాడిన తీరు చూసి, అతడికి గట్టిగా బుద్ధి చెప్పాలనుకున్నదామె.

లక్ష్మి పుట్టింటికి వెళ్ళింది. రెండు నెలలు గడిచిపోయాయి. జగ్గారావు యిక లాభం లేదనుకుని తానే స్వయంగా అత్తవారింటికి వెళ్ళాడు.

"నిన్ను పంపిన పనేమిటి? ఈ రెండు నెలలుగా పుట్టింట హాయిగా కాలం గడిపేస్తున్నావన్నమాట!" అంటూ జగ్గారావు భార్య మీద విరుచుకుపడ్డాడు.

లక్ష్మి ఏమాత్రం తొణక్కుండా చిన్న గొంతుతో, "కొంచెం మెల్లిగా మాట్లాడండి. మీరు వెయ్యి రూపాయిలు తెమ్మని పంపారు; నేను వచ్చి అమ్మకు ఆ మాటే చెప్పాను. అమ్మ నాకు ఆ మొత్తం యివ్వాలంటే, తాను తన పుట్టింటికి వెళ్ళి రెండు వేలైనా తేవాలని చెప్పి, వెళ్ళింది. కాని, ఆ సంగతి చెప్పగానే వాళ్ళ అమ్మ, తాను కనీసం మూడు వేలైనా తెస్తేతప్ప, ఆ మొత్తం యివ్వలేనని తన పుట్టింటికి బయలుదేరి వెళ్ళిందట. మా అమ్మమ్మ ఎంతకీ తిరిగి రాకపోవడంతో, మళ్ళీ

ధరణీప్రగడ వెంకటశేషగిరిరావు

నాలుగైదు రోజుల్లో తిరిగి వెళదామని, మా అమ్మ నిన్ననే ఇంటికి వచ్చింది. మా అమ్మ మళ్ళీ తన. పుట్టింటికి వెళ్ళి డబ్బు తేగానే, అది తీసుకుని వద్దామని ఆగాను,'' అన్నది.

జగ్గారావు ఏమనేందుకూ తోచక, తల గోక్కుని, '' సరే, అంతా బాగానే వున్నది. మరి, నువ్విక్కడ కూర్చుంటే, అక్కడ నాకు వండి పెట్టేవాళ్ళెవరున్నారను కున్నావు ?'' అన్నాడు కోపంగా.

లక్ష్మి ఎంతో శాంతంగా, ''సంపాదించి తెచ్చేవాళ్లుంటే, ఎవరైనా వండి పెడతారు. సంపాదనకూ నేనే, వంటకూ నేనే నంటే ఎలా కుదురుతుందండీ ?'' అన్నది.

ఆ మాటలతో జగ్గారావుకు తన చేతకాని తనం తెలిసివచ్చింది. ''సరేలే, పదఇంటికి పోదాం,'' అంటూ అప్పటికప్పుడు భార్య చేత ప్రయాణం కట్టించాడు.

అత్తగారు దిగులుగా ముఖం పెట్టి, ''బాబూ, మరోలా అనుకోకు! నేను పుట్టింటి నుంచి డబ్బు తేగానే పంపుతాను. నా భర్త బొత్తిగా అసమర్థుడు కావడంతో నీకు డబ్బివ్వలేకపోయాను. అందుకే, పుట్టింటికి పోయి డబ్బు తేవలసిన ఖర్మ పట్టింది. ఆడవాళ్ళ సొమ్ముతో బతకాలను కునేవాళ్ళతో, యిదే బాధనుకో! పిల్లను జాగ్రత్తగా చూసుకో, నాయనా,'' అన్నది.

అత్తగారి మాటలు ఎంతో మెత్తగా, మర్యాదగా వున్నా, వాటి వెనక వున్న హేళనా, హెచ్చరికా గ్రహించి జగ్గారావు సిగ్గుతో తల దించేసుకుని, ''అత్తయ్యా, డబ్బు కోసం మీరేం శ్రమపడకండి. డబ్బుదేముందీ, మనిషిలో మంచితనం, పట్టుదలా వున్నవని తోస్తే, ఎవరైనా అప్పు యిస్తారు. మీరు మాత్రం ఆరోగ్య విషయంలో జాగ్రత్తగా వుండండి,'' అని భార్యతో సహా తన ఊరికి వచ్చేశాడు.

ఆ తరవాత జగ్గారావు ఏనాడూ భార్యను డబ్బు తెమ్మని పుట్టింటికి పంపలేదు. స్నేహితులతో చచ్చుకబుర్లాడుతూ కాలం వృథా పుచ్చకుండా, చిన్న వ్యాపారం ప్రారంభించి క్రమంగా వృద్ధిలోకి వచ్చాడు.








పార్వతి క్షణంలో తన దుఃఖమంతా మరిచిపోయి, పిల్లవాణ్ణి ఎత్తుకుని దిష్ఠి తీసింది. శివుడు చేతులు చాచి పిలిచాడు. శివుడు మళ్ళీ ఏం చేసి పోతాడో అని భయం భయంగా తప్పటడుగులు వేస్తూ వెళ్ళిన విఘ్నేశ్వరుడి ముద్దు చేష్ఠకు అంతా ముచ్చటపడ్డారు.

"నాయనా, విఘ్నేశ్వరా! నిన్ను పుత్రుడిగా పొంది ధన్యులం అయ్యాం. చిరంజీవ!" అని శివుడు ఎత్తి ముద్దాడుతూంటే విఘ్నేశ్వరుడు కిందకు దూకి, "తండ్రీ! ఎంతమాట, నేను మీ కొడుకుని, ధన్యుణ్ణి నేను!" అంటూ పార్వతీశివుల పాదాలను చిరుతొండంతో చుట్టి, కళ్ళ కద్దుకొని ప్రణామాలు చేశాడు. తరవాత విష్ణువును సమీపించి ఆయనకు ప్రణామం చేశాడు.

విష్ణువు, "రావోయి ముద్దుల మేనల్లుడా!" అని దగ్గరకు తీసుకొని, "కళ్యాణమస్తు!" అని దీవించాడు.

అప్పుడు విష్ణువు కాంతిలో విఘ్నేశ్వరుడు నీలాకాశం రంగులో కనిపించాడు. విష్ణువుకీ, విఘ్నేశ్వరుడికీ ఏవో పోలికలున్నట్లు అందరికీ తోచింది. అదే మేనమామ పోలిక అంటే! అని అనుకున్నారు.

వినాయకుడు బ్రహ్మకు నమస్కరించాడు. బ్రహ్మ, "తొలిపూజ లందుకోవయ్యా బొజ్జగణపయ్యా!" అని అంటూ అతని ఏనుగబుగ్గలు చిదిమిచిటిక వేశాడు.

5. విజయవిఘ్నేశ్వరుడు.



తర్వాత విఘ్నేశ్వరుడు లక్ష్మికి, సరస్వతికి మ్రొక్కాడు. వాళ్ళిద్దరూ కలిసి అతణ్ణి ఎత్తుకుని చెరో చెంపా ముద్దాడి, "మేము విఘ్నేశ్వరుడి ఇరుపక్కలా అత్తాకోడళ్ళ పొరపొచ్చాలు మాని ఇలాగే సఖ్యంగా ఉంటాము!" అని పార్వతిని చూసి, "ముగ్గురమూ ఒకే ముగ్గురమ్మల మూలపుటమ్మ నుండి వచ్చిన సంగతి పుత్రగణపతి చెప్పనే చెప్పాడు. తర్వాత మళ్ళా విడివిడిగా క్షీర సాగరం నుంచి లక్ష్మి, బ్రహ్మ నాలుక నుండి సరస్వతిగా వాణి, మొదట దక్షుని కుమార్తె సతీదేవిగాను, ఇప్పుడు హిమవంతుని పుత్రి పార్వతిగా ఉమ అవతరించాము. జయలక్ష్మి అనే సిద్ధి, విద్యావతి అనే బుద్ధి వినాయకుడికి తగిన వధువులు. ఇహ విఘ్నేశ్వరుని పెళ్ళి ముచ్చటే చూడాలి!" అని అన్నారు.

లక్ష్మి, "లక్ష్మీకరుడైన విఘ్నేశ్వరుణ్ణి నమ్మిన వారిని స్థిరంగా అంటిపెట్టుకొని ఉంటాను! సిద్ధిస్వరూపిణి జయలక్ష్మి నా అంశ. వినాయకుడికి కానున్న భార్య!" అని చెప్పింది.

సరస్వతి, "విఘ్నేశ్వరుడు జ్ఞాన ప్రదాత, విజ్ఞానదాయకుడు. అక్షరాభ్యాసానికి ముందు పిల్లలచేత పసుపు ముద్ద విఘ్నేశ్వరుడి పూజ జరిపించి, విఘ్నేశ్వర పరిపూర్ణస్వరూపంగా గుండ్రంగా చుట్టించి మరీ ఓనమాలు దిద్దించాలి; నా అంశగల విద్యావతి బుద్ధిరూపిణి, వినాయకుని నాయకి!" అని చెప్పింది.

అప్పుడు విఘ్నేశ్వరుడు బేలముఖం పెట్టి, అందరినీ కలయజూచి, "చూశారా! పెద్దల తీరు ఎలా ఉందో! పెళ్ళి చేసుకొని, వారు పడ్డ అవస్థలే పిల్లలు కూడా పడాలని పెళ్ళితొందర పెడతారే గాని, హాయిగా ఉండనివ్వరు. అందునా అమ్మలకు మరీ ఆరాటం!" అన్నాడు.

అప్పుడు విష్ణుమూర్తి, "లేదురా బాబూ! అణిమాదిసిద్ధులకు, అష్టఐశ్వర్యాలకు మూలమైన సిద్ధులు ఎనమండు

గురు, చక్కనిచుక్కలై నిన్ను పూర్ణ చంద్రుణ్ణి కొలిచినట్లు సేవిస్తూంటే చూడా లని తొందరగానే ఉంది, సుమీ!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "ఓహో! అలాగా, నువ్వు కృష్ణావతారంలో అష్టమహిషులతో వేగుతూ ఆనందిద్దువు గానిలే!" అన్నాడు.

విష్ణువు మందహాసం చేసి, "నీ మాటకు తిరుగులేదుకాని, నీకు మాత్రం పదిమంది వధువుల పెళ్ళి తప్పదు!" అన్నాడు.

"అలాగైతే విఘ్నేశ్వరుడి పెళ్ళికి వెయ్యి విఘ్నాలు అన్న సామెతగా, నేనే విఘ్నాలు కల్పించుకోక తప్పదు!" అన్నాడు విఘ్నేశ్వరుడు.

"వెయ్యి కాదు, కోటి విఘ్నాలు వచ్చినా విఘ్నేశ్వరుడి పెళ్ళి ఆగదు!" అని బ్రహ్మతో గొంతులు కలిపి అందరూ అన్నారు.

అప్పుడు నారదుడు ముందుకు వచ్చి, "విజ్ఞానేశ్వరా! వాచాలతలో నన్ను మించావు కాని, పెళ్ళి తప్పించుకోవడం ఎవరితరం! నేను సంసారసాగరం ఈదడం చాతగాకనే కదా మునినై తిరుగుతున్నాను. జ్ఞానేశ్వరా! కళ్యాణం, ఉద్యోగం పురుషలక్షణం అని పురుషోత్త ములూ ఆది దేవుళ్ళూ అనిపించుకున్న ప్రముఖులంతా పెళ్ళిళ్ళుచేసుకొని సృష్టి,



స్థితి, లయాది ఉద్యోగాలు చేస్తున్నారు. నీవూ, నేనూ అనగా ఎంత!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు నవ్వి, "ఓహ్హో! నీకూ పెళ్ళి పిచ్చి తగిలే లాగుందే! స్వయంవరానికి కూడా వెళ్ళేవులాగుంది!" అన్నాడు.

నారదుడు, "త్రికాలవేదిని నేనేనను కుంటే అనంతకాలవేదివి నీవు. నీతో వాదించటం నా తరమా? మాటకారి తనంలో నీ తర్వాతనే నేను. అందరి జాతకాలూ నీ చేతుల్లోనే ఉన్నాయి. నిన్ను విస్మరించిన ఎలాంటి ఉద్దండ జ్యోతిషపాండిత్యమూ ఫలించదు. మనం ఇద్దరం మేలురకం వాగుడుకాయలం!



మాటలకు దిగితే అనంతకాలం చాలదు గాని, నీవు పూర్ణజ్ఞానివి. మా లాంటి అర్ధ జ్ఞానులు ఎలాంటి పిచ్చిలో పడ్డా నీ లాంటి వాళ్ళు తామరాకు మీద నీటిబొట్టు లాగ దేనికీ లొంగిపోరు. నీవు మాయకు అతీతుడివి. కాబట్టి సిద్ధిబుద్ధులు, అష్టసిద్ధులూ నిన్ను వరించుతాయని, నన్ను కూడా శ్రీరస్తు, శుభమస్తు, శీఘ్రకళ్యాణ సిద్ధిరస్తు! అని పలికించనియ్యి,'' అని అంటూ మహతి వీణపై కళ్యాణిరాగం మొదలుపెట్టి సామరాగం అందుకొని సౌరాష్ట్ర రాగంతో మంగళగీతాన్ని పలికించాడు.

దేవతలంతా ఎవరితావులకు వారు వెళ్ళారు. విఘ్నేశ్వరుణ్ణీ, పార్వతినీ, వెంటబెట్టుకుని శివుడు తన నిజనివాసమైన కైలాసానికి వెళ్ళాడు. నారదుడు తిన్నగా వజ్రదంతుడి దగ్గిరికి బయలుదేరాడు.

అనాడు పుత్రగణపతి తోకపట్టి గిరగిరా తిప్పి విసిరితే పడ్డపాటుకు వజ్రదంతుడి ఒళ్ళునొప్పులు యింకా తీరనే లేదు. ధవళ, భర్తకు పరిచర్యలు చేస్తున్నది. వచ్చిన నారదుణ్ణి చూసి, మళ్ళీ ఏం గొడవ తెచ్చి పెడతాడో అని అనుకుంటూనే లోనికి వెళ్ళింది.

నారదుడు మూషికాసురుడితో, ''నిన్ను పరాభవించిన గణపతి విఘ్నేశ్వరుడిగా వర్ధిల్లుతున్నాడు, మరి....,'' అంటూ ఆగాడు.

పరాభవాగ్ని రగిలి, వజ్రదంతుడు, ''ఇప్పుడేం చెయ్యమంటావు, నారదా?'' అని దిక్కుముహం పెట్టాడు.

నారదుడు, ''వరాలదేవుడు బ్రహ్మ ఉండనే ఉన్నాడుగదా! వజ్రాన్ని వజ్రంతోనే కొయ్యాలి! ప్రతీకారం సాధించు. గణపతి విఘ్నేశ్వరనామం ధరించాడు, గజముఖుడు! గుర్తుంచుకో!'' అని చెప్పి చల్లగా వెళ్ళాడు.

మహాశ్వేత అనే నామాంతరం గల ధవళ ఎంత చెప్పినా వినకుండా, వజ్రదంతుడు, ''మహాశ్వేతా! నీ పసుపు

కుంకాల పుణ్యమా అని నా కెలాగూ చావు భయం లేదుగద! ప్రతీకారం చేసి మనశ్శాంతిని పొందనివ్వు!'' అని చెప్పి ఘోరమైన తపస్సు చేసి బ్రహ్మను ప్రసన్నం చేసుకొన్నాడు.

''ఏం కావాలి యింకా?'' అని బ్రహ్మ అడిగాడు.

''విఘ్నానికి రూపం కల్పించి, నా ఆజ్ఞానువర్తిగా చెయ్యి!'' అని మూషికాసురుడు కోరాడు.

బ్రహ్మ విఘ్నాన్ని ఆవాహన చేసి వజ్రదంతుడి ముందుంచాడు. అతడి కేమీ కనిపించలేదు. బ్రహ్మ అతనికి సూక్ష్మ దర్శన దృష్టి యిచ్చాడు. విఘ్నం మామూలు కంటికి కనిపించని కారు నల్లని సూక్ష్మక్రిమి రూపంలో అతడికి కనిపించింది.

మూషికాసురుడు ఆశ్చర్యంతో, ''ఇదేమిటి! ఈ నలుసును ఏం చేసుకోను ?'' అన్నాడు.

బ్రహ్మ నవ్వి, ''విఘ్నం పెనుభూతం లాగ ఉంటుందనుకున్నావు కాని, విఘ్న బీజం కంటికి కనిపించని సూక్ష్మాణువు. సూక్ష్మక్రిమి వల్ల భయంకర వ్యాధి వ్యాపించినట్లే, అనర్ధదాయకమైన విఘ్న కారణం ఎంత చిన్నదైనా, ఎంతటి భీషణాకృతినైనా ధరించి సర్వనాశనం



చేయగలదు! కామరూపి, ఏ రూపాన్నైనా ధరించి, అనర్థాలు కలిగించటమే దాని పని. ఏం చేసుకుంటావో చేసుకో!'' అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

మూషికాసురుడు విఘ్నంతో, ''నువు వెంటనే మహా గజాసుర రూపంతో వెళ్ళి విఘ్నేశ్వరుణ్ణి నాశనం చెయ్యి!'' అని ఆజ్ఞాపించాడు.

విఘ్నం ఏనుగ శరీరమూ, ఏనుగ కాళ్ళూ, భయంకరమైన చిన్నతలా, పెద్ద కోరలూ, నిప్పుల్లాంటి కళ్ళుగల గజాసుర రూపం పొంది, మహా పర్వతం లాగ కత్తి ఝుళిపిస్తూ ఆకాశానికి ఎగిసి ఎగురుతూ వెళ్ళాడు.



కైలాసంలో విఘ్నేశ్వరుడు అల్లారు ముద్దుగా పెరిగి, తలిదండ్రుల అనుమతితో తాను పుట్టిన విశ్వకర్మ నిర్మించిన భవనానికి బయలుదేరాడు. ఎదురుగా వస్తూ మన్మధుడు రూపంతో కనిపించాడు. విఘ్నేశ్వరుడు ఆశ్చర్యంగా, ''కనిపించని వాడివి కనిపించావు. ఏమిటి విశేషం? నా మీద నీ విలువిద్య చూపకుమీ! అర్భకుణ్ణి,'' అన్నాడు.

మన్మధుడు వినయంగా తల వంచి, ''గజేంద్రాననా! నీవు నా బాణాలకు అతీతుడివి. నాకు కనిపించాలని ఉంటే కనిపించే వరం శివుడు యిచ్చినదేగదా. దగ్గిర పోలికలున్న దగ్గిరవాళ్ళం గనుక కనిపించాను, అంతే! నీవు ఎద్దునెక్కిన శివుడి కొడుకువైతే, నేను గ్రద్దనెక్కిన విష్ణువు కుమారుణ్ణి. నన్ను శివుడు దహించి బ్రతికించాడు, నిన్ను ఖండించి బతికించాడు. నా వాహనం చిలుక, నీ వాహనం ఎలుక. మనస్సును చలింపజేసే పూలమ్ములు నా ఆయుధాలైతే, మనోనిగ్రహాన్ని యిచ్చే పాశాంకుశాలు నీ ఆయుధాలు. మరి నీకు తమ్ముడు కుమారస్వామి పుట్టాలి గదా? పార్వతీ పరమేశ్వరుల పరస్పర అనురాగ తేజస్సే కుమారస్వామిగా అవతరించాలి! తారకాసుర నిర్మూలన జరగాలి. అందుకే గదా నన్ను దేవతలు బూడిద కూడా చేయించింది. కైలాసం చేరబోతున్నాను. అనుజ్ఞ యివ్వు!'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు, ''మన్మధా! అందుకే నేనూ కైలాసం దిగి వెళ్తున్నదీను. నీ పని నిర్విఘ్నంగా నెరవేర్చు. జయప్రదమవుతుంది!'' అన్నాడు.

మన్మధుడు అదృశ్యుడై పార్వతీ శివులున్న కైలాస మంటపాన్ని చేరుకున్నాడు.

విఘ్నేశ్వరుడు భవనాన్ని చేరుకొని, సింహద్వారానికి చేరువగా చంద్రశిలా వేదికపై సుఖంగా కూర్చొని పరిసర ప్రకృతిని ఆనందంగా చూస్తున్నాడు. మెరుగుపెట్టిన వెండి హిమగిరి శిఖరాలు

సంధ్యకాంతుల్ని తళతళ ప్రతిఫలిస్తున్నాయి. హిమానీ జలపాతాలు మంద్రగంభీరంగా సరిగమలు వినిపిస్తున్నాయి. అలాంటి ప్రశాంత సమయంలో, "విఘ్నేశ్వరుడనేవాడు ఎక్కడ?" అనే భీకరగర్జన దిక్కులు మారుమోగుతూ వినిపించింది.

మహా గజాసుర రూపం ధరించిన విఘ్నం, విఘ్నేశ్వరుడి ఎదురుగా వాలింది. భూమి కంపించింది. గజాసురుడు, "నేను మహా గజాసురుణ్ణి. నువ్వు గజముఖుడివైతే, నేను గజకాయుణ్ణి! నిన్ను హతమార్చవచ్చాను!" అంటూ రంకె వేశాడు.

విఘ్నేశ్వరుడు చెవిటివాడి లాగ అమాయకంగా చూస్తూ, "అబ్బ, ముక్కలు నరుక్కొని చెరుకుగడ తినాలని ఉంది. గొడ్డలి కాస్త పదును పెట్టి యిస్తివా నీకు కుడుములు పెడతాను," అని అంటూ పరశువును వాటంగా విసిరాడు. గజాసురుడి కాళ్ళు తెగి పర్వతంలా కూలాడు. విఘ్నేశ్వరుడు ఎక్కి తాండవం చేస్తూ మర్దిస్తూంటే, "మహాప్రభో! నేను విఘ్నాన్ని! బ్రహ్మ యిచ్చిన వరం మేరకు మహా గజాసుర రూపంలో వచ్చాను, శాస్తి అయింది!" అని విఘ్నం అరిచింది.

విఘ్నేశ్వరుడు, "నేను విఘ్న వినాశకుణ్ణి! అదీగాక నువ్వు ఇప్పుడు మాయదారి గజాసురుడివి. నిన్ను తుత్తునియలు చేయక తప్పదు. నీ తునకలు నన్ను, నిన్ను ఏమర్చిన వాళ్ళను మాత్రమే పట్టి పీడిస్తాయి. నువ్వు కాళీయనాగుడవై కాళిందిమడుగున దాగి ఉండు. బాలకృష్ణుడు నిన్ను మర్దిస్తాడు. అతని పాదాలు నీ తలల మీద పడి నీ పాప పరిహారం అవుతుంది; జాతి సర్పాల పడగలపై విష్ణు పాదముద్రలు అది మొదలు అలంకారంగా శోభిస్తాయి!" అని చెప్పి, పరశువును పట్టి విఘ్నాన్ని ఛిన్నాభిన్నం చేశాడు. ఆ రేణువులు అంతటా వ్యాపించి అదృశ్యమయాయి. విఘ్నం అణురూపంతో మిగిలింది. దేవతలు విఘ్నేశ్వరుడిపై పూల జల్లు కురిపించారు.





# ఇద్దరు మోసగత్తెలు

## 5

సరాయి యజమాని హజ్‌కరీమ్ మాటలకు, జీనాబ్ చిన్నగా నవ్వి, "దానికేమీ చచ్చుండదు, నా మిత్రులు చిల్లికడవలే అనుకోండి," అన్నది.

ఆమె తన ఇంటినుంచి తివాసీలూ, బాలీసులూ, బల్లలూ, కంచాలూ మొదలైన సరుకంతా మోయించి తెప్పించి, పెద్ద హాలులో పరిపించింది. తిండీ తాగుడూ సిద్ధంగా పెట్టించి సరాయి వాకిట కాపువేసి నిలబడింది.

కొద్దిసేపట్లోనే గూని అలీ, అతనితో మరి తొమ్మిదిమంది భటులూ ఆర్భాటంగా అక్కడికి వచ్చి చేరారు. జీనాబ్ అతన్ని చూసి, "తమరేనా అహ్మద్?" అని అడిగింది.

"లేదు, నన్ను గూనిఅలీ అంటారు," అన్నాడు అలీ నవ్వుతూ.

"అయితే మీరంతా, వచ్చి నా ఆతిథ్యం స్వీకరించండి," అంటూ ఆమె వారిని హాలులోకి తీసుకుపోయింది. వారందరూ సారా పీపా చుట్టూ మూగి తాగుడు ప్రారంభించారు. అందులో జీనాబ్ భంగు బాగా కలపటం చేత త్వరలోనే పదిమందీ ఒళ్ళు తెలియకుండా పడిపోయారు. వారిని ఒక్కొక్కరినే ఆమె కాళ్ళుపట్టుకుని దొడ్లోకి లాక్కుపోయి, ఒకరిమీద ఒకర్ని పేర్చి పైన ఒక బట్ట కప్పి, హాలు శుభ్రంచేసి మళ్ళీ తలవాకిట నిలబడింది.

కొద్దిసేపట్లోనే మరొక పదిమంది అహ్మద్ భటులు వచ్చారు. జీనాబ్ వారిని కూడా ఈ విధంగానే ఆహ్వానించి, తాగించి మత్తు తెప్పించి, దొడ్లో పేర్చి గుడ్డకప్పింది. త్వరలోనే నలభైమందికీ ఇదేగతి పట్టింది.

అఖరుకు గుర్రమెక్కి అహ్మద్ స్వయంగా వచ్చాడు. జీనాబ్‌ను వాకిట్లో చూసి, "ఏయ్ పిల్లా! నా భటులేమైనా కనిపించారా?" అని అడిగాడు.

"తమరు నగరకొత్వాలు అహ్మద్‌గారా? అయితే, తమ భటులకు ఈ వీధి చివర ఎవతో ముసలిది కనిపించిందట. ఆమె కోసం వెళ్ళామని తమతో మనవి చెయ్యమన్నారు! వారు దాన్ని పట్టుకుని వచ్చే లోపుగా హాలులోకి దయచేసి నా ఆతిథ్యం స్వీకరించమని మనవి." అన్నది జీనాబ్.

అహ్మద్ పరమానందంతో తాగటానికి ఉపక్రమించి, భంగు ప్రభావం వలన త్వరలోనే మొద్దులాగా పడిపోయాడు. జీనాబ్ అతని బనీను, లోపల వేసుకున్న చెడ్డీ తప్ప మిగిలిన దుస్తులూ, ఆభరణాలూ కాజేసింది. మిగిలిన నలభైమంది భటులనూ ఈ విధంగానే దోచి, దుస్తులన్నిటినీ అహ్మద్ గుర్రం మీద వేసుకుని సరాసరి తన ఇంటికి వెళ్ళిపోయింది.

అహ్మద్ అతని నలభైమంది భటులూ కూడా రెండు పగళ్ళూ, రెండు రాత్రులూ నిద్రపోయి, మూడోనాటి ఉదయం లేచారు. మొదట వారికి తామెక్కడ ఉన్నదీ తెలియలేదు. కాని క్రమంగా స్మృతి కలిగిన కొద్దీ తమకు జరిగిన ఘోరమైన అవమానం కూడా అర్థమై భరించరాని సిగ్గు కలిగింది. దుస్తులు కూడా లేకుండా వీధిలోకి పోవటం ఎట్లాగో అహ్మద్‌కు తెలియలేదు. కాని వెళ్ళక



తప్పదు. బనీన్లతో, చెడ్డీలతో ముందు అహ్మద్ వెనక అతని నలభైమంది భటులూ సాహసించి వీధిన పడ్డారు.

వాళ్ళు కొంచెందూరం పోయేసరికల్లా అతనికి హసన్ ఎదురై, అమాయకంగా, ''ఇదేమిటి, అహ్మద్? ఈ చలిగాలిలో ఇటువంటి దుస్తులతో తిరగటం ఆరోగ్యానికి మంచిదా?'' అని అడిగాడు.

''విధి ఎంతవారికీ తప్పదు గదా, హసన్! నన్నొక బాలిక మోసగించింది. నువ్వేమైనా దాని జాడ ఎరుగుదువా?'' అన్నాడు అహ్మద్, ఎంతో దీనంగా.

''ఆ పిల్లనూ ఎరుగుదును, దాని తల్లినీ ఎరుగుదును. వెళ్ళి పట్టుకోమంటావా?'' అని అడిగాడు హసన్.

''అదెట్లా వీలవుతుంది?'' అన్నాడు అహ్మద్ ఆశ్చర్యంగా.

''దానికేముంది? ఖలీఫా వద్దకు పోయి నీ వల్ల కాదని చెప్పు. ఆ పని నాకు పురమాయించమని ఖలీఫాను వేడుకో,'' అని హసన్ సలహా యిచ్చాడు.

అహ్మద్ అలాగే చేశాడు. ఖలీఫా హసన్‌ను పిలిపించి, ''నీకీ ముసలిది తెలుసునా? ఆ పని నీకు ఒప్పచెప్పితే, దాన్ని పట్టుకు రాగలవా?'' అని అడిగాడు.

''నేనా ముసలిదాన్ని ఎరుగుదును. అది ధనలోభంతో ఈ దొంగతనాలు చేసిందనుకోను. తన ప్రతాపం ఏలిన వారికి చూపటానికే ఇలా చేసి ఉండాలి. అది దొంగిలించిన సొత్తంతా తిరిగి యిచ్చే





షరతుపై ముందుగా దానికి తమరు అభయం యిచ్చే పక్షాన దాన్ని తీసుకు వచ్చి మీ ఎదట పెట్టగలను," అన్నాడు హసన్.

ఖలీఫా అభయం యిచ్చాడు. హసన్ నేరుగా దిలైలా ఇంటికి వెళ్ళాడు. అతనికి జీనాబ్ తలుపు తెరిచింది. "మీ అమ్మను రమ్మను, ఖలీఫా పిలుస్తున్నారు. ఆయన అభయం తెచ్చాను. మీ అమ్మ ఎత్తు కొచ్చిన సామానంతా గుర్రాల మీదికి ఎత్తించు," అన్నాడు హసన్.

దిలైలా మేడ దిగి వచ్చింది. ఆమె దొంగిలించిన సామానంతా గుర్రాల మీద వేయించారు. దిలైలా ఉన్నవాటిలో మంచి దుస్తులు ధరించి ఖలీఫా దర్శనం చేసు కోవటానికి సిద్ధమయింది.

"నీ దగ్గిర వున్న సామానంతా వచ్చిందా ?" అన్నాడు హసన్.

"అహ్మద్, అతని భటుల దుస్తులు తప్ప అంతా ఇచ్చేశాను. నిజం చెపుతున్నాను, ఆ దొంగతనంతో నా కేమీ సంబంధం లేదు," అన్నది దిలైలా.

"అవును, అది మరొకరి పని," అన్నాడు హసన్ నవ్వుతూ. ఇద్దరూ బయలుదేరి దర్బారుకు వచ్చారు.

ముసలిదాన్ని చూస్తూనే ఖలీఫా ఆగ్రహావేశంతో తన భటులకు ఆమె తల నరకమని ఉత్తరువిచ్చాడు. కాని హసన్ సవినయంగా అభయం మాట జ్ఞాపకం చేసిన మీదట ఖలీఫా, "నీ పేరేమిటి ?" అని దిలైలాను అడిగాడు.

"పావురాల టపా నడిపిన అధికారి భార్యను. నా పేరు దిలైలా," అన్నది దిలైలా.

"నువు చాలా సమర్థురాలివిగా కనిపిస్తున్నావు! వీరినందర్నీ ఎందుకు మోసం చేశావు ?" అన్నాడు ఖలీఫా.

దిలైలా ఖలీఫా ముందు సాష్టాంగపడి, "ఏలినవారు మన్నించాలి. నేను ధనాశ చేత దొంగతనాలు చేయలేదు. చౌర్యంలో ఘటికులైన అహ్మద్, హసన్‌లకు ఏలిన

వారు పెద్ద పదవులిచ్చారని విని, నేను వారికన్న ఎక్కువ శక్తులు చూపినట్టయితే నా భర్త చేస్తూ వుండిన పనిని నాకు దయ చేయిస్తారేమోననుకున్నాను,'' అన్నది.

ఖలీఫాకు దిలైలా చెప్పినదాంట్లో నిజం వున్నట్లు తోచింది. అతడు ఫిర్యాదీలకు వారి సొత్తు యిప్పించి దిలైలాతో, ''ఇప్పుడు నువు కోరేదేమిటో కోరు,'' అన్నాడు.

''ఏలినవారు నాకు, నా భర్త చేసిన ఉద్యోగమూ, జీతమూ దయ చేయించాలి. నా కా పని పూర్తిగా తెలుసు. నేనూ, నా కుమార్తే కలిసి పావురాలను సాకేవాళ్ళం. వాటికి ఉత్తరాలు కట్టే వాళ్ళం. పావురాల టపా నిమిత్తం ఏలిన వారు పెద్ద దివాణం కట్టించి దానికి నలభై మంది నీగ్రో బానిసలతో, నలభై వేట కుక్కలతో కాపలా ఏర్పాటు చేయించారు. ఆ దివాణాన్ని నిర్వహించినది నేను తప్ప నా భర్త కాదు,'' అని దిలైలా మనవి చేసుకున్నది.

ఖలీఫా వెంటనే ఆజ్ఞాపత్రం తయారు చేయించి, దిలైలాను పావురాల టపా నిర్వాహకురాలుగా నియమించాడు. నీగ్రోలనూ, వేటకుక్కలనూ ఆమె పరం చేయించాడు.

దిలైలా తన ఇంటి సామానంతా పావురాల టపా దివాణానికి తరలించింది. ఆ రోజే ఆమె మగదుస్తులు ధరించి, నెత్తిన వెండి పావురం గల బంగారు టోపీ ధరించి, టపా చేయవలసిన సందేశాలు తీసుకు రావటానికి రాజభవనానికి వెళ్ళింది. నలభై మంది నీగ్రోలకూ ఎర్రని జరీదుస్తులు ఏర్పాటు చేసింది. తన కొత్త భవనంలో అలంకారంగా ఉండగలందులకు నలభై ఒక్క మేకు కొట్టించి, వాటికి అహ్మద్ దుస్తులూ, గూని అలీ దుస్తులూ, మిగిలిన ముప్పైతొమ్మిది భటుల దుస్తులూ వేల గట్టింది. ఈ విధంగా దిలైలా తన పంతం నెగ్గించుకుని, తన కుమార్తె జీనాబ్‌తో సుఖంగా బతకసాగింది.

—(ఇంకా వుంది)



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1981 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.







N. Sundararajan T. V. Seshagiri

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)

★ మే నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అందానికి అలంకారం

రెండవ ఫోటో : అందుకు కావాలి సహకారం

ఈమని మణి, c/o లక్ష్మి డిపార్టమెంట్ స్టోర్, బిసెంట్‌రోడ్, విజయవాడ - 2

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# చందమామ కేమెల్ రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు




**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్—మొదటి బహుమతి రు. 15
కేమెల్—2వ బహుమతి రు. 10
కేమెల్—3వ బహుమతి రు. 5
కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్—10 సర్టిఫికెట్లు

చుక్కలు వేసిన గీత వెంట కత్తిరించండి.



12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

P.B. No. 9928, COLABA, Bombay-400 005.

ఫలితములు తుది నిశ్చయముగాను, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________ Age __________

Address ______________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

VISION

**CONTEST No.19**

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. *31 - 5 - 1981*



గోల్డ్‌స్పాటర్స్

# వారెవ్వా! వహ్వా!
# ఇదేమరి గోల్డ్‌స్పాటింగ్ రోజు!

Stick 'O

ఇదొక క్రొత్త మాట కాదు సుమండీ!
ఉత్సాహంతో పొంగులు వారే ఆనందాలచిందులకీ,
మజాగా హుషారైన భావాలకు
ఇదొక అనుభవం మరి. ఆనందం, మజా,
తమాషాలు మూడూ కల్పిన ముచ్చటైన
మురిపపు మాటే...గోల్డ్‌స్పాటింగ్.




గోల్డ్‌స్పాటింగ్‌తో వహ్వా...మజా య మజా!

